# ఆయాదు

# ఏకాంకికలు







నవ్య సాహితీ సమితి

హైదరాబాదు.

నాలుగవ ప్రచురణ. 

ప్రతులు. 1000.



శా. శ. 1871 సం.

మన్మథ: పుష్యము.



( అన్నిహక్కులు సమితివి. )




ప్రతులకు:

నవ్య సాహితీ సమితి

వివేక నగర్, చిక్కడపల్లి,

హైదరాబాదు-దక్కను.

ముద్రణ:

శ్రీ దత్త ముద్రాక్షరశాల

3466 రాష్ట్రపతిరోడ్డు,

సికింద్రాబాదు.

# నివేదిక

గత మూడు ఏండ్లనుంచీ సమితి సాగించిన సారస్వత కార్యకలాపాలు అందరికీ విదితమే. ఇంతవరకు సమితి ప్రచురించిన "కదంబం" (కథానికలు), "ప్రతిధ్వనులు" (నాటికలు), "సుమాంజలి" (కథానికలు) అనే యీ మూడు ప్రచురణలూ కూడా పత్రికా, పాఠకలోకంలోని సహృదయుల మన్ననలు పొందాయి. సమితికి పురోభివృద్ధికి యిది సూచకము.

నేడు రంగస్థలంమీద ప్రదర్శన కొరకు అనుకూలించే చక్కని నాటికలు చాలా తక్కువ వున్నాయి. ప్రదర్శనే ముఖ్యోద్దేశంగా గల ఏకాంకికలను సంకలనం చేయాలని సమితి సంకల్పించింది. క్రితం సంవత్సరం ఏకాంక నాటికల పోటీ జరిపాము. శ్రీ భట్టిప్రోలు కృష్ణమూర్తి గారికి ప్రథమ బహుమానం (రూ. 50), శ్రీమతి పాలగుమ్మి సుమతి (గౌరి) గారికి ద్వితీయబహుమానం (రూ. 30) శ్రీ రాపర్లదివ్య ప్రభాకర్ గారికి మూడవ బహుమతి (రు. 20) యివ్వబడినాయి. ఇవిగాక పోటీలో నాలుగవ స్థానానికి వచ్చిన మరి రెండు నాటికలు. శ్రీ సురవరాళి చిన వెంకటరెడ్డి, శ్రీ జోశ్యభట్ల గున్నేశ్వర్రావు గారల రచనలుకూడా చేర్చి, "అయిదు ఏకాంకిలు" అనే యీ సంపుటిని వెలువరిస్తున్నాము. ఇది సర్వవిధాలా జనాదరణీయమౌతుందని విశ్వసిస్తున్నాము. ఈ పోటీకి నిర్ణేతలుగా వ్యవహరించిన శ్రీయుతులు పాలగుమ్మి పద్మరాజు, ఎం.ఎస్.సి. (మద్రాసు), దివాకర్ల వెంకటావధాని, ఎం.ఎ. (ఆనర్సు) (హైద్రాబాదు) గారలకూ, అత్యుత్సాహంతో పోటీని జయప్రదంగా నిర్వహించడానికి తోడ్పడిన రచయితలందరికీ మనఃపూర్వకముగా మా కృతజ్ఞతలు తెలియ జేస్తున్నాము.

భారతదేశంలోని వివిధప్రాంతాలలోని ఆంధ్రులు సమితి సభ్యులుగా చేరి సమితి కార్యకలాపాలలో భాగస్వాములుగా వున్నారు.

నవ్యసాహితీ సమితి తనకు ఓపినంతవరకు చేస్తున్న యీ సారస్వతసేవకు సారస్వతాభిమానులందరూ యితోధికంగా చేయూత నివ్వవలసిందిగా విజ్ఞప్తిచేస్తున్నాము.

వేమరాజు నరసింహారావు.

29 జనవరి 1956

కార్యదర్శి

# ఉత్త చేతులు



రచన

భట్టిప్రోలు కృష్ణమూర్తి

# పాత్రలు.



గంగన్న.

శివన్న.

పూజారి రఘునాథు.

ధనంజయుడు.

కొంతమంది చిన్నపిల్లలు.

రజని.

జిగ్న.

# ఉత్త చేతులు

[తెర లేస్తుంది. ఒక చిన్న పూరింట్లో ముందు సగం భాగం ఎడమ ప్రక్కగా కనిపిస్తూఉంటుంది, మధ్య వెదురుపేళ్ల తడిక తల్పు. స్టేజిమధ్య గుండ్రని రాతి చప్టామధ్య గంగరావిచెట్టు. ఆ చెట్టుకు వెనుక కొద్దిగా దూరంగా చెరువుగట్టు. అవతలిగట్టూ, ఆ గట్టుమీద చెట్లూ, ఆ వెనుక దూరంగా ఒక కొండా కనిపిస్తున్నాయి. రెండు గట్టులకు మధ్య చెరువునీటి భాగం కొంత నీలంగా కనిపిస్తూ ఉంటుంది.

సమయం సాయంత్రం అయిదు గంటలు. తెర లేచేటప్పటికి రాతి చప్టామీద కూర్చుని పూజారి రఘునాథు కదురుతో దారం వడుకుతూ ఉంటాడు. గుడిసెముందు కూర్చుని గంగన్న మాసిపోయిన గుడ్డలో కుప్పగా ఉన్న డబ్బు లెక్కపెడ్తూ దొంతులుగా ఒక ప్రక్కను ఉంచుతూ ఉంటాడు. ప్రక్కన పగలగొట్టిన కుండ పెంకులు పడిఉంటాయి. ఒక గుండ్రని మట్టి హుండీ ఒక ప్రక్కగా ఉంటుంది.]

రఘు: రేపు తెల్లారేటప్పటికి గుడిసెలన్నీ ఖాళీ—ఈ పేటంతా పాడుపడ్డ ఊరయిపోతుంది!

గంగ: (లెక్కపెట్టిన దొంతి ఒకప్రక్కనుంచి, ఆ కుప్పలో రూపాయలేర్తూ) ఏ గూటిపిట్ట లాగూటిదరి సేరుకోవాలి గదయ్యావారూ?

రఘు: అవునులే, కాని ఆపిట్టలు పొద్దున్న బయలుదేరినవి సాయంత్రానికలా గూళ్లుచేరుకుంటాయి. ఈపిట్టలుమటుకు ఇన్నాళ్లు — ఇన్నాళ్లేమిటి ఇన్నేళ్లు—ఈగుడిసెలే తమగూళ్లనుకుని ఇక్కడేఉండిపోయి ఈనాటికిమళ్లీ వెనక్కెగురుతున్నాయి!

గంగ: నాలుగేళ్లవుతున్నాదనుకుంటాను మనమీడకొచ్చి, కదయ్యావారూ?

రఘు: రెండు నెల్లపదిరోజులు తక్కువ గంగన్నా నాలుగేళ్లకి.

గంగ: అవును, బాద్రపదపున్నమెల్లిన పంచమినాడు బైల్దేరినారంమనూళ్లో! ఆరేల్లుంటుందన్నపని నాలుగేల్లు నిండకుండానే పూర్తైపోనాది సిత్తరంగా.

రఘు: అవునుగాని గంగన్నా, ఆపంచమినాడున్న ఉత్సాహం ఈవాళున్నదంటావా ఈమనుషుల్లో? ఇక్కడేదో వజ్రాలవర్షం పడిపోతున్నదని చేతులు నొప్పెట్టాలిగాని ఏరుకోడానికేమీ అడ్డేలేదని అన్న ఆశలు నిండిన మాటల్తో, పాటల్తో కదిలింది ప్రజ ఆరోజు.

గంగ: మా రత్నకోటి బలిజీలకి అసలుత్తుత్తైపోవటం ఎల్లప్పుడూ అలవాటే లెండి కదయ్యావారూ, ఎప్పుడో ఒకనాడు తప్ప! (మాసిపోయిన గుడ్డలో డబ్బులన్నీ అయిపోతాయి. దొంతులన్నీ లెక్కపెట్టి నోటిలో (వేళ్లతో లెక్కపెట్టుకుని) పదహేడు దొంతుల పావుదొంతి రెండ్రూపాయిల ఆరణాలు మొత్తమెంతవుతాదయ్యావారూ? మొత్తం మూడొందల నలభైయొకరూపైల ఆణ్ణాలేనా?

రఘు: అవును, అంతే, ఈ అయిదువందల మందిలోనూ ఈ మాత్రం కూడబెట్టింది రాజయ్య, నాగన్న, నువ్వుమటుకే కనిపిస్తున్నారు.

గంగ: తోడోళ్లకి రుణాలిచ్చి వడ్డీలులాగి కూడబెట్టడం అదీ కూడబెట్టడమేనా అయ్యావారు? నాదిదంతా సెమటలోడ్చి రాయిమోతవల్ల గడించుకున్నదే! అప్పుడప్పుడు రుణాలిచ్చినాను నేనుగానీ వడ్డీమటుకు పుచ్చుకోలేదు. అయినా రుణాలిచ్చుకున్నోళ్లి ననాలిలెండి వచ్చిందాంతో సద్దుకోమాకుండా ఎప్పుడూ రుణాలే!

రఘు: ఏంచేస్తారు పాపం! వచ్చిండబ్బు తిండికీ జ్వరాలకీ చాలకపోతే!

గంగ: తాగుతుకో? ఎసవలు ఎందుకొచ్చినారిక్కడికి తాగి తందనా లాడ్డానికా, నాలుగురూకలు మిగుల్చుకోనెల్లి మళ్ళీ తమవురతికి కావలసిన వోస్తువులు కొనుక్కోడానికా? బుద్దన్నదిలేకపోతేసరి!

రఘు: తాగుడూ ఒక నిత్యావసరంగా చేస్తున్న ఈ బ్రతుకుల్ని నాశి గాని వీళ్లను నిందించి లాభంలేదు గంగన్నా!

గంగ: ఎందుకవసరమో తాదయ్యవారూ? తాగకపోసంత మాత్రాన నేనేం సచ్చిపోలేదే!

రఘు: నీ సంగతివేరు. ఎప్పుడూ పడవ, వల, పడవ, వల, పడవ. వల అన్న పలవరింతల్తో వాటి ఆలోచనలే మత్తుమందుగా గడిపేశావు నువ్వు నీకున్న దీక్ష అందరికీ ఎలాగొస్తుంది?

గంగ: ఆళ్లకర్మం! అందుకే ఉత్తసేతుల్తో తెచ్చుకున్న గిన్నాముంతాకూడా అమ్ముకోని తిరిగెల్తున్నారింటికి! (మళ్ళీ గొంతులన్నీ గుడ్డలోపడేసి మూటకట్టి రెండో హుండీ చేత్తో పట్టుకుని) సివుడి హుండీ బరువుగానే ఉన్నాదయ్యవారూ? ఇందులోకూడా దగ్గిర దగ్గిర మూడొందలుండాలి—మొత్తమంతా కలిసి పడవకీ వలకీ, ఓ, కావల్సినంత!

రఘు: (ముందుకొచ్చి జాలిగాచూస్తూ) ఇంకా అది లెక్కపెట్టలేదా?

గంగ: లేదు—మా సివుడొచ్చింతరువాత ఆడిచేతే లెక్కపెట్టిస్తాను. వోడు కూడబెట్టింది ఆడే లెక్కబెట్టుకుంటే మంచి సంతురుష్టిగా ఉంటుంది. కదయ్యవారూ?

రఘు: (నిట్టూర్చి) హాఁ!

గంగ: అదేటయ్యవారూ!

రఘు: ఏమీలేదు.

(గోల వినిపిస్తుంది)

గంగ: (ఎడంవైపు లోపలికి చూస్తూ) ఏటా గోల?

రఘు: ధనంజయుడు వచ్చినట్లున్నాడు—పిల్లలందరూ వెంటబడి కేకలేస్తున్నారు.

గంగ: పాగలా ధనంజయా!

రఘు: (ద్వారానికిచూస్తూ) అవును, పిచ్చి ధనంజయోయే! కంపెనీవాళ్ల బాగు కోసం తన అడుగు పోగొట్టుకుని పిచ్చెక్కిన ధనంజయో!

గంగ: అడువు పోవడమేమిటి, కుంపినీ వోళ్లు పన్నెండొందలిచ్చినారు కద య్యావారు? (లేచి నిలబడలేడు)

రఘు: ఇచ్చారు—కాని గంగన్నా, ఆ భూమి ఒకనాడు రెండువేల కడుగుతే ఇవ్వలేదిట ధనంజయో!

గంగ: వెర్రోడు! అప్పుడే అమ్ముకొని మరోచోట కొనుక్కో వలసింది భూమి, ఈ నాటికి కుంపినీకి అప్పజెప్పుకొల్లేకుండా!

రఘు: ముందిలా అవుతుందనప్పుడు తెలుస్తే అలాగే చేసుండేవాడు!

(గుడిసె పక్కనుండి ధనంజయో వస్తాడు స్టేజిలోపలికి చేతిలో ఒక కొమ్మ ఉంటుంది. వెనక కొంతమంది పిల్లలు లోపలికివచ్చి పూజారి రఘునాథునుచూసి ఆగిపోయి "పూజారయ్య వోరు, పూజారయ్య వోరు!" అని తమలోతాము అనుకొని లోపలికి వెళ్లి పోతారు.)

*ధనం: ఒహ్పుకొ మొహప్రభుకే! దేఖొంతు, అపాణొదయాకొరిజొనొబానొంకు కొన్తుజె, గొచ్చొరె తుచ్చటాక పాత్రొకాహింకి రుపాకొటొంకాపారి బొదొళై దియొంతు! కొహిచేవేకొధా అపాణొ, భుల్లిజీ బేనాఃహీ!

(లోపలికి వెళ్లిపోతాడు.)

రఘు: పాపం!

గంగ: ఇన్నాళ్లీ ఒడ్డిదేశంలో ఉన్నానుగాని ఈ బాషే బోదపడదునాకు, ఏటంటున్నాడయ్యావారు?

---

* ధనం: ఓహో! పూజారి బాబుగారు? చూడండి—దయచేసి భగవంతుడికి చెప్తారుగదా, చెట్లకే ఆకులన్నీ ఎందుకు, దండుగ, వెండిరూపాయలుగా మార్చెయ్యమనండి మర్చిపోకుండా చెప్పండేం!

రఘు: ఏముంది? తమరు పూజార్లుకదా, ఒయ్యించి దేవుడితో చెట్లకీ ఆకు లెందుకు దండుగ, వెండిరూపాయలు వ్రేలాడేయించండి అని మర్చిపోకుండా మనవి చెయ్యమన్నాడు.

గంగ: కుంపినీ వోల్లు దయతో ఇచ్చిన రూపాయలొకటే సరిగా ఉంచుకున్నాడు గాదు, ఇంక దేముడికి మనవి చెయ్యాలంట! (గుడిసెలోపలికి వెళ్లి డబ్బుదాచి మళ్లీవచ్చి) వస్తాను అయ్యవారు చెరువుకెల్లొస్తాను.

రఘు: వెళ్లు.

(గంగన్న చెట్టువెనుకకువెళ్లి మూరపుగట్టెక్కి నిష్క్రమణం. రఘునాథు వెళ్లి మళ్లీ చప్టామీద కూర్చుని చదుకుంటూ ఉంటాడు. రజనీ కుడిప్రక్కనుండి వస్తుంది లోపలికి.)

రజ: * (తెలుగు సరిగా రాదు. నత్తుతూ మాట్లాడుతుంది.) మా బాప్పా ఈడకొచ్చినాడా పూజారి బాబూ?

రఘు: ఇప్పుడే వెళ్లాడా తోటలోకి రజనీ.

రజ: ♦ ఎల్తానుబాబూ! సొకాళ్ళాంతారూకిచ్చి చీ ఖాయినైబాప్పా!(వెళ్తుంది.)

రఘు: పాపం!

(గంగన్న మళ్లీ వస్తాడు.)

రఘు: మళ్లీ వచ్చావేం గంగన్నా?

గంగ: సందుకుపెట్టి తాలమేసి నానా లేదా సరిగానని అనుమాన వొచ్చింది. వోరా ఎల్లిందిప్పుడు అయ్యవారూ?

రఘు: ధనంజయో కూతురు – పొద్దున్నుంచీ ఏమీ తిననేలేదట వాడు, వాడ్ని వెతుక్కుంటూవచ్చింది.

గంగ: అదా! (గుడిసెలోపలికి వెళ్తాడు. జిగ్నీ వస్తుంది కుడివైపునుంచి, పాటపాడ్తూ)

---

* మా అయ్య యీడకొచ్చినాడా, పూజారి బాబూ?

♦ ఎల్తాను బాబూ, పొద్దుటికాడినుంచీ ఏమీ తిననేలేదయ్యా!

జిగ్నీ: జిలిబిలి సొగసుల చిన్నారి పువ్వీది
తళుకుల రేకుల ముత్యాల నవ్వీది-
కనువిప్పి ననుజూడు చెలికాడా!
మనసిచ్చి మాట్లాడు నాజోడా!
దణ్ణాలండయ్యగోరు!

(గంగన్న పైకివచ్చి జిగ్నీని చూస్తాడు)

గంగ: ఇంకా సీకటున్నా పడ నేపడ లేదు, అప్పుడే తయారైనావ్ మాపేట్లో!

జిగ్నీ: నీపని నువ్వు సూసుకుంమూ తాతా, (రాగ ధోరణిలో) నా ఊసు నీకేల ఓ తాతా, నీ ఊసుచూసుకో, ఓ తాతా!

గంగ: (చిరాకుగా) తాతెవడు, తాత!

జిగ్నీ: నాయెంపు కన్నెత్తిసూడని ప్రతివోడూ తాతే-కదండయ్యగోరు? మీరు కాదులెండి, ఎప్పుడో ఓనాడు మీరు సూస్తారు నాయెంపు.

రఘు: (జాలిగా) చూస్తాను, ఆ రోజొచ్చినప్పుడు, ఎవ్వరూ నీవైపు కన్నెత్తి చూడనప్పుడు ఈ ముత్యాల చిరునవ్వు మూగపోయి, చిన్నారి యీ పువ్వు వడిలిపోయి నావైపు జాలిగాచూసినప్పుడు, ఆరోజు చూస్తాను జిగ్నీ!

(గంగన్న వెళ్లిపోతాడు.)

జిగ్నీ: పోనిద్దురూ అయ్యగోరు! మీరెప్పుడూ ఇలాగే మాట్లాడతారు! అవును గాని యీయేల రాత్రే నేటికి, యీళ్ళంతా ఎళిపోవడం?

రఘు: అవును రేపటినుంచీ యీవైపు నీకు పనుండదు రావడానికి.

జిగ్నీ: మరెందుకీ యెంపురావడం! ఎగువపేటెంపుకెళ్లడం ఆ కాడినుంచి మళ్లీ యింటికెళ్లిపోవడం ఈ దిగువపేటలో మరేటుంటుంది!

రఘు: (వడకడంమాని కదురుకు దారంచుట్టూ ముందుకొచ్చి) ఎగువపేటా మరో సంవత్సరానికి ఖాళీ అయిపోతుంది జిగ్నీ! అప్పుడెక్కడికి వెళ్తావు?

జిగ్నీ: ఎర్రోళ్ళల్లా మాట్లాడుతారు అయ్యగోరు! ఇక్కడికెలావొచ్చినానో, అలాగే మళ్లీ ఎల్లి రైలెక్కిపోడం, ఏటూళ్లో యాపారం బాగుంటుం దంటే ఆ కాడేదిగుండిపోడం జిగ్నీకేటి సింతయ్యగోరూ ?

రఘు: అవును ఇప్పుడుండదులే చింత.

జిగ్నీ: (నవ్వుతూ) ఇప్పుడుకాదు, ఎప్పుడు ఉండదు. అంతగా ఆసింతే వొచ్చినాడుమీరు, సెప్పారుగదా యెతుక్కొని యెతుక్కొని మీ కాడకొస్తాను, ఏం ?

రఘు: తప్పకుండా !

జిగ్నీ: సివన్నింకా రాలేదేటయ్యగోరూ? సీరకొని పెడ్తానని సెప్పినోడు నాల్నెల్లనుంచీ మొహంతప్పించి తిరుగుతుండాడు, ఈ రజినీ దొరికిం దగ్గిరినించీ మరీ బూప్రపంచకంలో ఆడోళ్లే లేరనుకుంటున్నాడు. ఆడె ళిపోయేలోగా యీయేల వొనూలు సేసెయ్యాలి.

ఎక్కడికి పోతావు మోసకాడా !

చిక్కావా, చూస్తాను నీటుకాడా ! (ఎడంవైపుకు వెళ్లిపోతుంది)

రఘు: (జాలిగా) నలుగురూ నడిచేదారిలో మొలిచిన గడ్డిపువ్వు !

(శివన్న కుడివైపునుండి వస్తాడు)

ఎందుకింతభయం శివన్నా ?

శివ: భయంవెవడికి ?

రఘు: నీకే! జిగ్నీ నాతో మాట్లాడుతూండడం చూసి ఆ చెట్టుచాటున దాగు న్నావుకదూ, అదెల్లేంతవరకూ ?

శివ: ఊఁహు ! దేవుడి సంగతేటో కనుక్కోలేక నీ వురితి మానుకొనొచ్చావు కాని పంతులుగోరూ, మనుసుల సంగతిమటుకు కనిపెడ్తుంటావు. నీ కక్కర్లేకపోయినా !

రఘు: దేవుడికంటె మనుషులకే నా అవసరం ఎక్కువనిపించి మా దేశానా వృత్తి శివన్నా! చూడు, ఎవళ్లకన్నా ఏవిషయంలోనన్నా సరే మాటిచ్చింతర్వాత దాన్ని నిలబెట్టుకోవాలి.

శివ: నేను నామాట నిలపెట్టుకోపోతే నీకేటి తక్కువౌతాది పంతులుగోరూ?

రఘు: ప్రతీమనిషీ చేసే మంచిపనితోనూ ఒక్కొక్క అడుగుముందుకు వెళ్తుంది ప్రపంచం. అలాగే ప్రతీవాడి తప్పుపనీ వెనక్కు లాగుతుంది ప్రపంచం మొత్తాన్నీ. తానే కాకుండా తన తోడివాళ్లూ ప్రపంచాన్ని వెనక్కి లాగకుండా ఉండడానికి మనిషై పుట్టినందుకు ప్రతీవాడు సాధ్యమైనంతవరకూ ప్రయత్నించాలి.

శివ: బావుంది, పంతులుగోరూ, కాని జోరెక్కువై తిరగడి పోతాదేమో సూసుకో, బండి.

రఘు: అలా తిరగబడే బండికాదు. ప్రపంచం శివన్నా! దానికేంగాని చూడు.....

శివ: జిగ్గి తనసంగతి తాను సూసుకోగలదయ్యా, పంతులుగోరూ! నీకేల దానికోసం సింత?

రఘు: జిగ్గి సంగతికాదు, ఇంకా ఉన్నారు నువ్వు మోసంచేస్తున్న వాళ్లు నీతో మాట్లాడాలనే ఇక్కడ కాచుక్కూచున్నా నీ సాయంత్రం, కూచుందాం రా శివన్నా.

శివ: ఇప్పుడు తీరిక లేదు నాకు పంతులుగోరూ—

రఘు: తీరికెప్పుడు? ఈ రాత్రికేమో మీరంతా వెళ్లిపోవడానికి సిద్ధంగా ఉన్నారు.

శివ: (గుడిసెవైపుకు నడుస్తూ) మళ్లీ వస్తానులే, మాట్లాడొచ్చు.

రఘు: (అడ్డుగావచ్చి) మరెప్పుడొస్తావు? చూడు...

శివ: బాగుందయ్యోయ్ పంతులుగోరూ, బలవంతమెట్టి మాట్లాడిస్తావేటి నాచేత!

రఘు: బలవంతపెట్టడానికి నేనెవణ్ణి! నీలో నిద్రపోతున్న మంచితనాన్ని లేవగొడ్దామని చూస్తున్నాను. చూడు శివన్నా, నువ్వు నడుస్తున్నా వనుకో. దారిలో మధ్యన చక్కటి గులాబీపువ్వు పడుంటుంది, దాన్ని కాలితో నలగదొక్కుకు వెళ్లిపోగలవా? బండిచక్రమైతే ఆ పని చేస్తుం దిగాని నువ్వు చెయ్యగలవా అలా?

శివ: (నిస్సహాయ్యంగా) దానిమీద నా కాలుపడకుండా తప్పించుకొని వెళ్లి పోతానుగాని ఎందుకు తొక్కేస్తాను పంతులుగోరూ?

రఘు: ప్రాణంలేని పువ్వుని తొక్కడానికి నీ మనసొప్పుకోదు గాని ప్రాణ మున్న మనుషుల్ని తొక్కుకుని వెళ్లిపోతావు?

శివ: (బెరుకుగా వెనక్కుతిరిగి) మళ్లీ వొస్తాను.

రఘు: (శివన్న చెయ్యి పట్టుకుని మృదువుగా) ఆగు శివన్నా రజనీసంగతి మాట్లాడుతున్నాను.

శివ: (పూజారి వైపుతిరిగి) ఆ ఒడ్డి పిల్లకోసం నీ కెందుకు బాధ పంతులు గోరూ ?

రఘు: ఒరియాగానీ, తెలుగుగానీ, అన్యాయంజరుగుతున్నప్పుడు అడ్డు వెళ్లడం నాపని.

శివ: ఎవళ్ల సంగతి ఆళ్లే చూసుకుంటారులే.

రఘు. పాపం ఆ పిల్ల తన సంగతి తాను చూసుకునే స్థితిలో లేదుగాబట్టే నేను మాట్లాడుతున్నాను. ఉన్న తండ్రేమో పిచ్చివాడై తిరుగుతు న్నాడు. దిక్కులేని పిల్లది!

శివ: అలాంటి దిక్కులేనోళ్లకి దేవుడే దిక్కు పంతులుగోరూ.

రఘు: నిజమేకాని, గుళ్లల్లో కూచున్న రాతి దేవుడు కాదు దిక్కు కావాలి మనుష్యుల మనస్సుల్లోవున్న దేవుడు దిక్కు కావాలి.

శివ: పోనీ, ఎవడో ఒకడు.

రఘు: నీ మనసులో ఉన్న దేవుణ్ణి పైకిరానియ్యకుండా తాళంవేసి ఉంచే శాపు—అ తలుపులు తెరద్దామనే నా ప్రయత్నం.

శివ: అదిగో జిగ్నీ వస్తూంది, వస్తాను, పంతులుగోరూ!

రఘు: (చెయ్యి పట్టుకొని ఆపి) జిగ్నీని చూసి భయపడి పారిపోతున్నావు. ఎందుకంటే దానికి నోరుంది. నోరులేనిపిల్ల కాబట్టి, మర్యాదలో పెరిగింది కాబట్టి రజనీకి అంతకన్నా ఎక్కువ ఘోరమైన మోసంచేసి ఆ సంగతే నీకక్కరలేనట్లు తిరుగుతున్నావు. (రఘునాథు శివన్న చెయ్యి వదులుతాడు)

(జిగ్నీ వస్తుంది ఎడంప్రక్కనుంచి పాడుతూ)

జిగ్నీ: దొంగలా తిరిగేటి
దొరపిల్లడా,
దొరికావు ఈవాళ
వలికుర్రడా
(వచ్చి శివన్న చేయి పట్టుకుంటుంది.)

శివ: వదులు.

జిగ్నీ: వదులుతాను, వదులుతాను! మీ అయ్యోంటపని గుడిసెకాడ కెందుకు రాడమని సూస్తుంటే, మరీవయ్యారాలోతున్నావు!

రఘు: జిగ్నీ—వదులు శివన్నని—ఒక ముఖ్య విషయం మాట్లాడుతున్నాం మేము.

జిగ్నీ: లేదయ్యవోరు యీడు మల్లీ దొరకడు నాకు.

రఘు: దొరుకుతాడు. దొరక్కపోతే నాది పూచీ. నాచేతుల్లో వడికిన దారంతో నేసిన చీరిస్తాను నీకు, వెళ్లు జిగ్నీ!

జిగ్నీ: సిత్తం. (శివన్నని వదలి వెళ్లిపోతుంది కుడివైపుకు)

శివ: నిన్ను చూస్తే అందరికి బయమే పంతులుగోరూ !

రఘు: భయంకాదు, అభిమానం, అవును గాని రజని సంగతి ఏంచేస్తావు శివన్నా ?

శివ: సెప్పడానికేటుంది ! ఇమ్మంటే పాత్రికో పదికో ఇస్తానుదానికి

రఘు: జిగ్నికి కట్టు విలువ డబ్బుతో, రజనీకి కాదు ! మొదటే యీ మాట రజనీక తెలుసుంటే నీ మొహమే చూసేది కాదది ! అమాయికురాల్ని నమ్మించి, పెళ్లి చేసుకుంటానని మోసంచేసి.

శివ: ఇప్పుడేటి చెయ్యమన్నావు పంతులుగోరూ !

రఘు: అన్నమాట నిలబెట్టుకో నీ తోటి తీసుకుపోదాన్ని !

శివ: నాతోపాటూ! అదేమన్నా నా భార్యా యేటి...

రఘు: మీ కర్మంగాని మంత్రాలెవడో వచ్చి చదివినప్పుడే పెళ్లనుకుంటున్నావా శివన్నా ! ఒకరిని గట్టిగా నమ్మించిన మాటలే మంత్రాలకంటె ఎక్కువ శక్తి మంతాలు !

శివ: ఏదో ఆ నేశానప్పుడు దాన్ని నమ్మమన్నానేటి నేను ! జిగ్నితోనూ అలాటి మాటలే అన్నాను లచ్చతూర్లు.

రఘు: జిగ్ని నవ్వి ఉంటుంది ఆ మాటలు నమ్మక రజనీ మనస్ఫూర్తిగా నమ్మింది, ఆ మాటల్ని వింటూ ఒళ్లంతా పులకరించగా అదే తేడా రెండిటికీ.

శివ: నీకూ తెలుసును పంతులుగోరూ ! మనూళ్లో లచ్చిమి ఉందని. నాకోసం యేచి ఉంటుందది. అసలొకతూరి మా అయ్యతో రజనీ సంగతెత్తాను. పనికి రాదన్నాడు. సిన్నప్పుడే లచ్చిమి తండ్రికి మాటిచ్చేసినాడుట మా అయ్య.

రఘు: ఎప్పుడో తనకి సంబంధించని విషయంలో మీ నాన్న ఇచ్చిన మాటకి విలువుంది గాని నీకు సంబంధించిన విషయంలో నువ్విచ్చిన మాటకి విలువ లేదన్న మాట !

శివ: నువు సదువుకున్నావి, నీతో మాట్లాడ్డానికి సత్తాలేదు నాకు పంతులు గోరూ!

రఘు: నేను చదువుకున్నా సంస్కృతంలో మాట్లాడ్డంలేదు, నీకు తెలిసిన, నువు మాట్లాడేభాషలో, నువ్వు ఆలోచించ గల విషయాల గురించే మాట్లాడుతున్నాను నేను. నువ్వు జవాబు చెప్పలేక పోతున్నా వంటే చదువు సత్తాలేక పోవడంకాదు కారణం, నువ్వు ఓడిపోయావు గనక! జవాబు చెప్పడానికి మాటలు రాక కాదు, అసలు జవాబే లేక!

శివ: జవాబు లేదేం? దానిజాతి.

రఘు: భాష వేరైనంత మాత్రాన.

శివ: భాష సంగతి కాదు, మనలోలాగే ఆళ్లకీ ఎక్కువ తక్కువలున్నాయి జాతిలో మేము రక్నకోటి బలిజీలు, అది ఒడ్డి వాళ్లల్లో తక్కువలో తక్కువైన.

రఘు: (కోపం వస్తుంది) ర......క్న......కో.....టి....బలిజీ! (కోపం సద్దుకుని మృదువుగా) క్రమమైన యీ జాతి హద్దులమీద నమ్మక మున్న వాడివి. రజనీ తక్కువ జాతిదని తెలిసుండే దానిపై పెందుకు చూశావు నువ్వు శివన్నా! ఇప్పుడా మాటనే హక్కులేదు నీకు.

శివ: ఏటో గందరగోళం రేపేస్తున్నావు (బుర్రమీద వేలితో కొట్టుకుని) యీ లోపల పంతులు గోరూ!

రఘు: అక్కడకాదు. (శివన్న గుండెలమీద తిరగవేసిన చేతివ్రేళ్లతో కొట్టి) ఇక్కడ గందరగోళం రేగాలి! రేపి తీర్తాను.

శివ: ఇక్కడ గందరగోళం కాదుగాని ఏదో బయంపెట్టేశావు! రజనీకి నేనలా సెప్పడంతప్పే కానీ ఆ అందాన్ని సూసి మనసైంది. మరో యిదంగా అడందే దారిలేక అలా అనేసినానప్పుడు. పంతులుగోరూ, నీ కెప్పుడూ అలాటి మనసులు రావూ? నువ్వు మటుకు సెయ్యవూ అలాటి పన్లు.

రఘు: మనిషన్న తర్వాత ఎంమకురావు, వస్తాయి. కాని చూడు, నేను చెయ్యవలసిన పన్లకి బంధాలు అడ్డు. అందుకే వాట్లో పడకుండా తప్పించుకు తిరుగుతున్నాను, నీలాగైనకాముందు చూసుకోకుండా అమాయకుల్ని మోసం చేసెయ్యకుండా! ఒకనాడెప్పుడన్నా కాలు జార్తే అన్ని పనులు మానుకొని ఏది ఏలాగైనా ఆ గొలుసులకి నా చేతులు అప్పగిస్తాను.

శివ: నీ సంగతేమ—అందరికీ ఆ బలముండొద్దా?

రఘు: నిజాన్నెదుర్కొని నిలబడే బలంలేక పోయినవాడు మరి బ్రతికేం లాభం శివన్నా? మనం పశువులమైతే నిజం—అబద్ధం, మంచీ—చెడూ ఈవిచక్షణ అవసరమే రాదు. పశువులకి ఆలోచించే శక్తిలేదు, మొట్టమొదటి పశువు భూమిమీద కళ్లు తెరిచిన నాడు ఏ స్థితిలో ఉందో ఈ నాటి పశువూ అదే స్థితిలో ఉంది. అందువల్లనే. కాని నువ్వూ, నేనూ, రజనీ, జిగ్నీ అందరం మనుషులం, ఒకళ్లకొకళ్లు అన్యాయం చేసుకుని పశువులకన్నా హీనమైన స్థితిలోకి దిగజారి పోయినప్పుడు మరింక బ్రతకడ మెందుకు?

శివ: నిజంవే పంతులుగోరూ? కాని రజనీకి అన్యాయం చేసేశానా అని నేవెళ్లిపోతే మరోడ్ని పెళ్లాడి సుకంగా ఉండొచ్చునది.

రఘు: రజనీని నువ్వర్థంచేసుకోలేదు. అందుకే ఇలా అంటున్నావు నువ్వెళ్లి పోవుతున్నావని తెలిసిన వెంటనే నీకాళ్లమీద పడి నువ్వెళ్లిపోతే తాను బ్రతకలేనని ఏడుస్తూ అనలేదు గనక నువ్వెళ్లిపోయినా దానికేమీ నష్టంలేదని అనుకుంటున్నావు నువ్వు. అది పైకి బాధచెప్పుకుని తిరిగే రకం మనిషి గాదు. తండ్రి పిచ్చెక్కిపోయినప్పుడుకూడా పడని బాధ నువ్వెళ్లిపోతున్నావని తెలిసి నప్పటినుంచి పడుతున్నదది. ఎంతో శ్రమపడి తెలుసుకున్నానీ సంగతి. రజనీలాటి మనుషులకి ఇవ్వడానికి ఒక్కమనసే ఊంటుంది. ఒకసారి నీలాటి వాళ్లకే వళ్లకన్నా అదిచ్చే

సారా, మరింకేమీ ఉండదు. ఇంకొకరి కివ్వడానికి. పవిత్రంగా ఎదుటి వ్యక్తికి తన మనసిచ్చినప్పుడే ఆలోచనల చోటునిండి వాళ్ల బ్రతుకులు ఆనందంగా గడుస్తాయి. కాక నీలాటివాళ్లు వాళ్ల మనసును పెల్లగించి లాగుకొని ప్రతిగా ఏమీ ఇవ్వకుండా నిర్దయతో వెళ్లిపోయిననాడు ఆలోచనలు ఉత్తగాయంగానే మిగిలి నెత్తురులు కారుస్తూ ఆమరణాంతం బాధపెడుతుంది. రజనికి నువ్వు చేస్తున్న అన్యాయమిదే!

శివ: (బాధగా) పంతులు గారూ.........

రఘు: అదిగో (కుడివైపు లోపలికి చేయిజాపి చూపెట్టి) చూడు...

శివ: (వెనక్కి తిరిగిచూసి) రజనీ!

రఘు: అవును, రజనీ, ఆ చెట్టు మొదట నిలబడి ఉంది_నీవైపు చూస్తూ! నీ కెంపువడి మెరుస్తున్నాయా కళ్ళు! ఆ కనుకొలకులనుండి నీరు జారడం లేదు, కాని ఆ లోపల ఉన్నవన్నీ నీళ్ళే, నెత్తురులే! ఒక్క మాటన్నా అనదు, అనలేదు_నువెళ్లిపోతుంటే! ఇంక కొంచెంసేపటికి చీకటి పడి పోతుంది, ఆ కళ్లు నీకు కనిపించవు—కాని నువెళ్ళిపోయేంతవరకు నువ్వున్నవైపుకు చూడటం మానవా కళ్ళు. నువ్వెళ్ళిపోయాక కూడా ప్రతిరోజూ అలాగే అదివచ్చి అక్కడ నిలబడి ఈ గుడివైపుకు చూస్తూ నిలబడుతుంది. కొన్నాళ్లకి గుడికూడ జీర్ణమై శిధిలమై నామరూపాలు లేకుండా పోతుంది. ఒత్తుగా గడ్డి అడవి మొక్కలూ ఇక్కడ మొలిచిపోతాయి. కాని నువ్వొకనాడున్న ఈ చోటుని చూడడం మానదు, అదేకళ్లతో, అది జీవితాంతమూ! ఎన్నోసార్లు చూసానేమిట్ట దాన్ని రాత్రిళ్ళు అక్కడే! దాని మనస్సుని పెల్లగించుకొని దాని సంగతే నీకక్కర్లేకుండా హాయిగా నువ్వు నిష్పపోతుంటే మనసు పోయినచోట నెత్తురులు కారేగాయంతో అలాగే నిలబడి ఉండేది అది!

శివ: (కళ్ళనిండా నీళ్ళు తిరుగుతాయి) నన్నేం చెయ్యమన్నావు పంతులు గారూ? నాకేమీ పాలుపోవటంలేదు.

రఘు: వెళ్ళు, రజని దగ్గరకెళ్ళి చెప్పు, దాన్ని నీతో తీసుకుపోతానని. ఇంకో సంగతి—అది మొదట నీకు మనసిచ్చినప్పుడు మరే బంధాలూ లేవు దానికి. ఇప్పుడలా కాదు, పిచ్చెక్కిపోయిన తండ్రి ఒకడున్నాడు అతణ్ణి వదిలి ఒంటరిగా నీతో రాలేదది. అందుకని ధనంజయాన్ని కూడా మీతో పాటు తీసుకుపో. దిక్కూ మొక్కూ లేనివాళ్ళయిపోయారు పాపం వాళ్ళు.

శివ: ధనంజయా మాతో వస్తాడేమిటి? ఆ పిచ్చోడు?

రఘు: వస్తాడు—కూతురు చెప్తే వింటాడు. ఆ నమ్మకముంది నాకు. ఇక్కడేముంది వాడికి మరి? అసలే పెద్ద వయసు, అందులో మతి చలించిపోయింది.

శివ: ఏమో పంతులుగారూ, నువ్వు చెప్పేది జరిగేలా లేదు. అసలయ్య ఏమంటాడో ఏమో ఈ పిచ్చోణ్ణి తీసుకెళ్ళి ఏంచెయ్యడం మనవాళ్ళు? మా పొట్టలే నింపుకోడానికి దినదినగండమైపోతుంటే.

రఘు: మొగవాడివి నువ్వనవలసిన మాటలుకావివి. నీ తండ్రే ఆ స్థితిలో ఉన్నాడనుకో, వదిలేసిపోతావా, పోషించలేనని? ధనంజయానికున్నది ఒక్కతే కూతురు; దాన్నెవడు పెళ్ళాడితే వాడే భరించాలి ఆ ముసిలోడి భారం! వాడున్నాడా పోయాడా అని అడిగేవాళ్ళెవళ్ళూ లేరిక్కడ! రజనీకోసమనీ ధనంజయా ఆస్తికోసమనీ ఇదివరకు వాళ్ళ పంచన చేరేవాళ్ళుండటూ ఈ కొంపకూ పోవడంతోనే వాళ్ళ ఊసే పట్టించుకోవడం మానేశారు: నిన్నే ఇక్కడే ఉండి పొమ్మందామను కున్నాను గాని మీ అయ్యకి మరో గతి లేదు. వాళ్ళని నీతో తీసుకు పోవడంతప్ప ఇంకేదారీ లేదు.

శివ: మా అయ్యా ఒప్పుకుంటేగాని......

రఘు: అయ్యా! అయ్యా ఏమనుకుంటాడోనని అన్ని విషయాల్లోనూ అనుమానిస్తున్నావా నువ్వు శివన్నా?

శివ: అదేటి పంతులుగోరూ......

రఘు: శివన్నా, నాకళ్ళు కప్పలేవు నువ్వు. మీ నాన్నకింకా తెలియదు నువ్వతనికి చేసిన మోసం!

శివ: నేనా! మోసమా!! అయ్యాకి!!! అదేటి పంతులుగోరూ?

రఘు: విడదీసి చెప్పాలన్నమాట నీకు, ఒకరోజు కాకపోతే ఒకరోజు బైట పడక తప్పదు, అయినా ఎందుకిలా మోసంచేస్తారో ఒకళ్ళనొకళ్ళు! తనుదాచుకున్న హుండీ పగులగొట్టి లెక్కబెట్టుకున్నాడిందాక మీ నాన్న అందులో డబ్బు మొత్తం మూడువందల నల్భై ఒక్కరూపాయల అరకాలుంది.

శివ: ఇక్కడే పగులగొట్టినాడా అయ్య! మాఊరెళ్ళాక చూద్దామన్నాడు!

రఘు: వలా, పడవల బంగారు కలలు ఏమాత్రం నిజమౌతాయో చూసుకుందామన్న ఆత్రుత పట్టలేక పోయాడు ఆఖరురోజు! ఇదిగో, ఇవే ఆహుండీ పగిలిన పెంకులు! నీ హుండీ పగలగొడ్దామని తీసాడుగాని (నొక్కి నొక్కి అంటూ) నువ్వు గడించి కూడబెట్టిన రాతిముక్కలూ, ఇనుప ముక్కలూ నీ చేతే లెక్కపెట్టిద్దామని మళ్ళీ వెనక్కుంచేశాడు. (శివన్న తలవంచుకుంటాడు) తలెందుకొంచుకుంటున్నావు? ఎప్పుడో ఒకనాడు నిజాన్నెదుర్కొని నిలబడాలి నువ్వు! ఇందాక రెండు హుండీలు చూపించాడు నాకు. దృష్టి సరిగాలేని మీ తండ్రికి కనపడ లేదుగాని నేనుగమనించా నాలోపల ఏమున్నాయో! జూదమాడొద్దని

తుచ్ఛమైన కామసంతృప్తి కోసం డబ్బు తగలపెట్టవద్దని నీకెన్ని సార్లో చెప్పాను. పట్టించుకున్నావు గాదు. చివరికి నిన్ను కని పెంచిన వాడి ఆకలు (క్రింది పండుటెంకలు చూపెడ్తూ) ఇలా అయిపోయేలా చేసే స్థితికొచ్చావు.

శివ: (తలవంచుకునే) పంతులుగోరూ........

రఘు: ఇప్పుడు విచారించి ఏమీ చెయ్యలేవు. చేపలుపట్టి బ్రతికేవాళ్ళకి ప్రతీ రోజూ ఆకలుతృప్తి నైపోవటం అలవాటేనని అనుకున్నానిందాక మీనాన్న, తనకి ఆమాట కొంతకాకపోతే కొంత అన్యాయిస్తుందన్న అనుమానం లేక. (దూరంగా చెరువు గట్టుమీదినుంచి దిగి వస్తూంటాడు గంగన్న. ఆకుల చప్పుడు విని అవైపు తిరిగి చూస్తారిద్దరూ.) అదిగో మీ నాన్నొస్తున్నాడు. నువ్వెళ్ళు, రజని నువ్వూ కలిసి ధనంజయో దగ్గరి కెళ్ళండి, మీనాన్న సంగతి నేను చూస్తాను.

శివ: వొస్తాను, పంతులుగోరూ. (కుడివైపుకు వెళ్తాడు ఆలోచిస్తూ (గంగన్న తడిగుడ్డ తెచ్చి రాతిచప్టామీద ఆరబెట్టి ముందుకొస్తాడు.)

గంగ: మా సివుడిలావుంది ఆ ఎల్లేది, కదయ్యావారూ?

రఘు: ఔను, మళ్ళీ ఇప్పుడే వస్తాడు (తాను వెళ్ళి రాతి చప్టామీదకూర్చుని) కూర్చో గంగన్న

గంగ: (అనుమానిస్తూ) సీకటిపడిపోతున్నది.

రఘు: నాకు తెలుసులే ఎందుకు తొందర పడుతున్నావో—ఇంకా టైముంది కూర్చో, మళ్ళీ రేపటినుంచీ ఈ చప్టాదగ్గర ఇలా కూర్చొని మాట్లాడ బోంగదా!

గంగ: (కూర్చుని) మీకు తెలీందేటుంది, కదయ్యా వారూ?

రఘు: వ్రతం చెయ్యొద్దన్నానని ఒరియా పురోహితుడ్ని పిలిచారు మీ రందరూ.

గంగ: నేను పిలవ లేనండి. మీరొస్తున్నారని నేనూ ఒద్దనే అన్నాను. కాని ఆల్లుయిరలేదు. దేనికన్నా నలుగురితో కలిసేగదా, కదయ్యావారూ?

రఘు: మంచిదే, ఆకట్టు అన్నిటిలోనూ ఉండొద్దూ? నిరుడు అందరూ సమ్మె చేసినప్పుడు నువ్వూ, నీలాటివాళ్లు కొంతమందీ పనిలోకెళ్ళడం మానలేదు!

గంగ: సూడండి, నా ల్రోజులు పనిమానేస్తే నాలుగుకట్టల నూలుడబ్బులు పోనాయి, అందుక నే మానానుగాదు నేను.

రఘు: సమ్మెలో పనికెళ్ళిన ప్రతివాడికీ ఏదో కారణముంటూనే ఉంటుందిలే.

గంగ: వరతాని కేటుందయ్యా వారూ? తలకోఅణా ఏసుకున్నాం- ఇన్నాళ్లు మానేత వరతాలు నేయించినోల్లు యీ యేడాదినుంచీ మీరు మానెయ్యడం ఏటో నచ్చలేదు నాకు, అందులో ఊరోల యీ పేటా దిలి వూరికెల్లిపోతున్నామా, ఆకరుదినం వు!

రఘు: వ్రతమని పేరుపెట్టి ఆ ప్రసాదపు గంజాయి పీల్చడానికెగబడతారు కొందరు, మరికొందరు కుండలకు కుండలే ఖాళీచేస్తారు. వీరాకు బోధపడని సంస్కృత మంత్రాలు చదివి మత్తెక్కడానికి బాగా సాయపడినన్నాళ్ళు నేను చేసిన పనులు నచ్చాయి మీకు. మీకు బోధపడే మాటల్లో నేనర్థంచేసుకున్న ప్రపంచపు నిజాలు బోధపరుద్దామని ప్రయత్నిస్తున్నాను కనక నా మాటలిప్పుడు మీకు నచ్చవు.

గంగ: నచ్చలేదని కాదయ్యా వారూ! మీరుసెప్పేవన్నీ నిజమే — కాని ఏదో దేవుడని దయ్యమనీ......

రఘు: దేవుడిమీద నమ్మకం మానెయ్యమని చెప్పటంలేదు మీకు. కాని మీరనుకుంటున్నది దేవుడుకాదనీ, అవివేకంగా దేవుణ్ణి కొలవడంవల్ల

మీరొక్కరే అనుకున్నా నా ముందుకెళ్లగని చెప్తున్నాను నేను. నిజమెక్క-
డుంటే అక్కడే ఉంటుంది దివ్యత్వం. ఏపనులు మరొకరు చేయడంవల్ల
నీమనస్సుకు నొప్పి కలుగుతుందో ఆపనులు నువ్వు చేయనినాడు
సర్వోత్తమమైన పద్ధతిలో దేవుణ్ణి కొలుస్తున్నావన్నమాట నువ్వు!
నీవల్ల మరొకరు బాధపడకూడదు, మరొకరివల్ల నువ్వు బాధపడ
కూడదు--ఇది జరిగిననాడు దేవుడు నీలోనే వెలిగిపోతుంటాడు! నేను
చెప్పేమాటలకి వాళ్లు మీరు నమ్మకపోయినా నేనేం ఆశ్చర్యపడటంలేదు.
సంకెళ్ళు తెగగొట్టుకొని బైటపడటం చాలా కష్టమైనపని. ఆపని
నా సాధ్యమైనంతవరకు మీచేత చేయిద్దామని ప్రయత్నిస్తున్నాను.
నేనుపోతే నీతర్వాత మరొకడువస్తాడు ఆపని చేయించటంకోసం.

రాం: మీరు మా మంచికే చెప్తుంటారని మాకు తెలుసునయ్యావారూ! అందుకే
మీరంటే మాఅందరికీ ఇంతభిమానం.

రఘు: తన కేవైపునుంచి మంచిమాట అన్నది వినిపిస్తున్నదో కనిపెట్టాలది
మనస్సు. అందుకే అప్పుడప్పుడు నామాటవినక నాకెదురుతిరిగినా
మీరు, నేనేమీ అనుకోను: ఆశ్చర్యపడను.

రాం: ఏదో యిలాటి చిన్నచిన్నవి తప్పిస్తే మీమాటకెదురెవడు తిరగలేదయ్యా
వారూ? మాకింటిదే పూరిపాకల పరిస్థితో దినాలు గడక్క ఇలా
దేవంకాని దేశానికి గంజినీళ్లకోసమని రావలసొచ్చినాది, తమరేటి
చెప్పకుండని మాయింటికొచ్చారు దేవాలయంలో పూజారిపని వదులు
కొని ఇంతదూరం రాబారం! మాకోసమని తమరింత బాధపడుతూంటే
ఎదురు తిరిగే బుద్ధిలేని సవటువసు, కదయ్యావారూ? రామనాదుగారు
బిడ్డల్లా సూసుకునేవోరు మమ్మల్ను, ఆరితరువాత ఆరంతటోళ్లు
రగునాదుగారు తమరు!

రఘు: అసలు నాకా అర్చకవృత్తి ఇష్టమే ఉండేదిగాదు మొదట్లో సంగన్నా
కాని నాన్నగారు చెప్పారు, ప్రజలకు సేవచెయ్యాలంటే ఆపనిలోనే

ఉండి ప్రయత్నించమని అందుకే తొమ్మిదేళ్ల ఆ ఊళ్లో ఆ పని చేశాను. గుడికొచ్చేవాళ్లలో పైతరగతులవాళ్లకంటె కిందిమెట్లమీది మీలాంటి వాళ్లకే నాలాంటివాళ్ళ అవసరం ఎక్కువనిపించింది నాకు. అందుకే నే ఇంచుమించు ఒక్కొక్కడిగా మీరందరూ ఊరొదిలి బయల్దేరి వస్తూంటే నేనూ వచ్చేశాను మీతోపాటు. నమ్మకం లేకపోయినా ఇక్కడ మూడేళ్ళపాటు మీచేత వ్రతాలు చేయించాను, క్రమక్రమంగా మిమ్మల్ని మార్చుదామని. చివరికా వ్రతాలు చేయించడమూ అనవసరమే అనిపించింది. నాకు తెలిసినవి, నేను తెలుసుకున్నవి పడవమీదికీ పనికొచ్చేలా ఉపయోగించదలుచుకొన్నాను. ఈ పనిలో ఓడిపోవటమన్నది లేదు చూడు, గంగన్నా!

గంగ: మీకోడిపోటమేటి, కదయ్యవారూ?

రఘు: అవునుగాని మళ్లీ ఊళ్లో కావలసిన సరంజామాకొని తయారుచేస్తానన్న మాట, వలా, పడవా నువ్వు?

గంగ: మరి దేనికిన్నాళ్లు యింత బాధపడ్డవయ్యవారూ? ఎల్లుండి తరువాత యీ సొమ్మెట్టి ఒక నెల్లో పడవా, వలా తయారుసెయ్యనూ? ఆసివర సివ్రనా 'ఈసివర నేనూకూకోని తెడ్డేసుకుంటూ ,, అలలమీద తేలి ఎల్లిపోతూ అందరమూ కలిసి "హైలేస, హైలేస" అని పాడుతూంటే సొరగమే కదయ్య వారూ?

రఘు: స్వర్గమే, కాని ఎన్నాళ్ళపాటూ స్వర్గసుఖం నిలబడుతుంది గంగన్నా?

గంగ: (తెల్లబోయి) అదేటయ్యవారూ?

రఘు: అవును, దాన్ని గురించిన ఆలోచన ఎందుకు పైకి రానియ్యవు నువ్వు? పడవ ఎన్నాళ్ళు నిలబడుతుంది గంగన్నా? వలెన్నాళ్లొస్తుంది?

గంగ: (అనిష్టంగా) అదేటయ్యవారూ? జాగరతగా వాడుకుంటే...

రఘు: నాలుగేళ్లు మహా అవుతే అయిదేళ్లు ఈ వలా, పడవా, చివికిపోయి పొయ్యిలోకి మంటకే పనికొచ్చే స్థితికొచ్చేసినప్పుడు మరొక వలా పడవా తయారుచేసుకోడానికి కావలసిన డబ్బు కూడబెట్టినవాళ్ళు, ఎంతమందుంటారు మీలో? నూటికో పదిమంది తేలడం కష్టం. అందులో నువ్వు తప్పకుండా ఉంటావని నిబ్బరంగా చెప్పగలవా గంగన్నా?

గంగ: (ఆలోచించి) గీతమీదాదారపడుంటాది బాబూ అది.

రఘు: ఎన్నాళ్లీ గీతని నమ్ముతారు మీరు? పున్నమెళ్లిన ఆ పంచమినాడు ప్రతీ వాడినోటా అయిదారేళ్ళలో తిరిగొచ్చి వలా, పడవా తయారు చేసుకుంటామన్న మాటే! కాని ఈవాళ?

గంగ: సెప్పినాను కదయ్యావారూ, వోడిగీత బావుంటె ఆడు మిగుల్చుకున్నాడు నాలుగుడబ్బులు.....

రఘు: ఇంచుమించు అయిదువందలమందిలో అయిదుగురి గీతన్నా బాగుతే దన్నమాట! చూడు గంగన్నా మాటవరసకి నీకు వందమంది కొడుకులున్నారనుకో, నీదగ్గిర ఉన్న డబ్బు అందరికీ ఇస్తావా, లేకపోతే ఏ నలుగురైదుగురికో ఇచ్చి తక్కినవాళ్లను ఉత్తచేతుల్తో పొమ్మంటావా?

గంగ: పైసో, పరకో పదిమందికీ ఇస్తాను కదయ్యావోరూ?

రఘు: డబ్బులేనప్పుడు ?

గంగ: లేకపోతే వోరికీలేదు.

రఘు: అంతేకాని బంతిలో పలుపక్షపాతం మటుకు చూపించవు. నీకున్న విద్య వందమందినీ కూర్చోబెట్టి బోధపరుస్తావు, ఎవడు బాగుపడగలిగితే వాడే బాగుపడతాడు అంతేకదూ?

గంగ: అంతేనండయ్యవారూ!

రఘు: భూమితల్లను, దేవుడను, ప్రకృతి అను, అది తనపిల్లలందరికీ చేసేపని అదే — సుఖమన్నది మాటలుకట్టి లేదెక్కడా. ప్రకృతివల్ల మన కొచ్చింది బుద్ధి, ఆలోచించే శక్తి. అందరికీ ఉందది. ఎవడుపయో గించుకోగలిగితే వాడే బాగుపడతాడు. అంతేగాని దేవుడనేవాడె వడో ఎక్కడో కూచోని మననొసటరాసిన గీతలవల్ల నడవటం లేదు బ్రతుకులు. ఈ అందరికీ ఆలోచించే శక్తి ఉంది. కాని చదువన్నది లేకపోవడంవల్ల అది ఎలా ఉపయోగించుకోవాలో తెలియక, అన్యా యాన్నెదిరించి నిలబడ్డంచేతకాక, స్వార్థపరులైనవాళ్ల చేతుల్లో కీలు బొమ్మలై వాళ్లసుఖానికి పాటుపడుతున్నారు. పొద్దుననుంచి పొద్దు నుంకేవరకు నాలుగేళ్లు కష్టపడ్డ వీళ్ళు మిగిల్చిందేమిటి. నీ సంగతోది. లెయ్,సరిగ్గా తిండికూడా తినకుండా పడవా వలా అనుకుంటూ వాటి కోసం డబ్బు కూడబెట్టావు; తక్కినవాళ్ళో? ఉత్తప్రాణం నిలబెట్టు కోడానికిమటుకే సరిగ్గా చాలదు వాళ్ళ కష్టానికొచ్చిన ప్రతిఫలం! గీతలేక కాదిది, చేతకాక!! అసలు మీ వృత్తిలోనూ ఇంతే! పెట్టుబడి పెట్టి పడవా వలా తయారుచేసుకుని అయిదేళ్ళు కష్టపడి చివరకు ఆవలా పడవా పనికిరాని స్థితికొచ్చేసరికి మళ్లీ కొత్తవి తయారుచేసుకోడానికి తగిన సత్తాకూడా లేకుండా పోతున్నారు! ఇంతమంది గీత బాగులేక కాదు ఇది, అసలు మీవృత్తి నడిచే పద్ధతిలోనే ఎక్కడో తప్పుం డాలి కదూ?

గంగ: కదయ్యావారూ?

రఘు: పాతపద్ధతులు పట్టుకుని వేలాడ్డంవల్ల అవుతున్నదిలా. కాని కొత్త పద్ధతులు మీఅంతట మీరు నేర్చుకునేస్థితిలో లేరు. అది పైవాళ్ల బాధ్యత. వాళ్ల బాధ్యతని వాళ్ళు గుర్తెరిగేలా చేసే శక్తిమటుకు మీలోఉంది. ఆశక్తి నుపయోగించుకో గలిగిననాడు అందరూ సుఖ పడతేరు అంతేగాని గీత, కర్మ, అనుకుంటూ కూర్చున్నవాళ్ళు లాభం లేదు.

(పడమటి వైపునుండి జిగ్నీ వస్తుంది. గంగన్న అక్కడ ఉండడం చూసి కూనిరాగం తీసుకుంటూ ఎడమవైపుకు వెళ్ళుతూ ఉంటుంది.)

గంగ: ఈ పక్కనుంచి నడొద్దని సెప్పినానా నీకు? ఎన్నితూర్లు అనే అదే సెప్పమన్నావ్?

జిగ్నీ: రేపటి కాడినుంచీ రాన్లే తాతా! (కూనిరాగం తీసుకుంటూ లోపలికి వెళ్ళిపోతుంది.)

గంగ: ఏం తలతిరుగుడే నీకు!

రఘు: ఇలాటివాళ్ళని చూసి అసహ్యించుకోకు గంగన్నా! మన ప్రజలల్లో ఉన్న బురదలో పుడుతున్న పూలివి. ఆ బురదని లాగిపారెయ్యడానికి ప్రయత్నించాలి గాని ఈ పూలని అసహ్యించుకుని లాభంలేదు.

గంగ: అయ్యవారికందరిమీదనీ జాలే!

రఘు: చూడు గంగన్నా, ఇలాటివాళ్లు మరికొంతమంది తయారవడం మంచి దంటావా, కాక అటువంటి పరిస్థితుల్లోకి ఎవళ్ళన్నా జారిపోతున్నప్పుడు, మన శాయశక్తులా ప్రయత్నించి వాళ్లనాపి మంచిదారిలో పెట్టడం సబబంటావా?

గంగ: ఇటుమంటోల్లెంత తగ్గితే అంతమంచిదండి, కదయ్యవారూ?

రఘు: మామూలుగా అయితే ఎవణ్ణో పెళ్లిచేసుకుని సవ్యంగా బ్రదుకు గడుపుకోవలసిన ఆడదొకతె, ఎవడో ఒక బాధ్యత తెలియని మొగవాడివల్లో పడి, కాలుజారిందనుకో, వాడుగాని మోసంచేసి దాన్నొదిలి వెళ్లిపోయాడనుకో, తన్నుగాని తనమీదాధారపడి ఉన్న వాళ్లనిగాని పోషించుకోడానికి అది జిగ్నీలా తయారైందంటే తప్పెవరిదంటావు గంగన్నా, మోసంచేసి వెళ్లిపోయిన మగవాడిదా, దాందా?

గంగ: అనేతిలేని మొగోడిదే, కదయ్యా సారూ?

రఘు: ఈ అన్యాయం జరిగేముందు మనకి అది అనడానికవకాశమున్నప్పుడు ఆపడం ధర్మమంటావా?

గంగ: (హఠాత్తుగా ఏదో స్ఫురించి ఆగి) వోరిగురించి మాట్లాడుతుండారయ్యా వారు?

రఘు: ఎవరి గురించన్నానంటే! నేనే అనుకో ఆ అన్యాయం చేసేసింది.

గంగ: శంకరా! మీరొక్కరే నాయినా అటువంటి పని సెయ్యరు! (లేచినిలబడి) నీవ్వదటువంటి పని సేసినాడేటయ్యా వారూ?

రఘు: కూర్చో, గంగన్నా!

గంగ: సెలవియ్యండయ్యా వారు, ఆడే గనకయితే తొక్కిలాలిసేస్తాను.

రఘు: శివీ కోపం పనికిరాదు, తొందరపడకూడదు కాలు జారకేసున్నది అందరికీ ఉంది, శివన్న నీకొడుకు.

గంగ: (కోపంగా) ఆడేనన్న మాట!

రఘు: (లేచి భుజంమీద చెయ్యేసి) అవును, శివన్నే! కాని తొందరపడి ఎంచెయ్యగలవు నువ్వు? వాణ్ణి తంతావు, మరీ కోపమాపుకోలేకపోతే వాణ్ణి చంపేస్తావు! దానివల్ల లాభమేమన్నా ఉందా, నష్టమెంతుంటుందో ఆలోచించుకో! రజనీ దిక్కులేనిపిల్ల......

గంగ: దిక్కులేనోల్లకోసమని మమ్మల్ను గంగలో దిగమన్నారేటయ్యా వారూ? ఆడికొకతూరి సెప్పినాను యీల్లేదని, కడుపుసెడ...

రఘు: గంగన్నా, చూడు, జరిగిందేదో జరిగిపోయింది, ఇప్పుడు తొందరపడి ఏదో చేసేసినందువల్ల జరిగింది మార్చలేవు ... (దూరంగా శివన్నా, రజనీ రావడం గమనిస్తాడు) ఎవరో వస్తున్నారు...

గంగ: వోరది? (వెనుకకు తిరిగి చూస్తాడు)

రఘు: ఎవరో! పద, అలా చెరువుగట్టుమీదికి వెళ్లి మాట్లాడదాం (ఇద్దరూ చెరువుగట్టువైపుకు నడుస్తారు. ఇంతలో రజనీ, శివన్న కుడివైపు నుండి వస్తారు. వెనుక నడుస్తున్న రఘునాథ వైపుచూసి ఏదో అనబోతాడు శివన్న. రఘునాథ గంగన్న చూడకుండా చేతితో వారించి వెళ్ళిపోతాడు. వాళ్లిద్దరూ చెరువుగట్టెక్కి కనుచూపు మేర దాటి వెళ్ళేంతవరకూ శివన్న, రజనీ ఏమీమాట్లాడరు.)

శివ: మరేటి సెయ్యమన్నావు రజనీ...ఒకేళ పంతులుగోరు సెప్పితే యినుకుంటాడేటో మీయయ్య.

రజ: * లాభో నాహీఁ, శిబో, లాభో నాహీఁ...

శివ: యెర్రి బాగోతం మీయయ్యది ...... ఆడురానంటాడు మనెంట. ఆడొగ్గేసి రమ్మంటే నువ్వురానంటావు! నాకేటో ఏటీపాలుపోదు.

రజ: ఈడ నువ్వు ఉండలేవు...ఎల్లునువ్వు...

శివ: మీ అయ్యనొదిలి నువ్వెలారాలేవో మాఅయ్యనొదిలి నేనా ఉండలేను ఈకాడ. ఎక్కువ తక్కువల సంగతికి అయ్యనొప్పిస్తాడు పంతులుగోరు, నిన్ను మాయెంట తీసుకుపోదామనుకుంటే ఇదొకల్లరొచ్చింది. నువ్వులేకుండా యెల్లడానికి మనసొప్పదు, ఏటిసెయ్యడం? (మోకాళ్లమీద తలెట్టుకుని కూర్చుంటాడు కింద. రజనీ అతని ప్రక్కనే తానూ కూర్చుంటుంది.)

రజ: ** తుమె జావ్, శిబో, మోహాయకిచ్చే చింతాకోరోనా, జావ్ తుమె భాగాబానోలో ఒచ్ఛాంతి అమొహారి దుఃఖి గొరీబో మానోంకు దేఖిబాకు; చింతా కాహింకి శిబో?

---

* లాభంలేదు, శివో! లాభంలేదు.

** నువ్వెళ్ళు శివో! నాకోసమేమీ చింతపడకు– దేవుడున్నాడుగదా, మాలాంటి పేదసాదల్ని, అనాథుల్ని చూసుకోడానికి–నువ్వెందుకు బెంగపెట్టుకుంటావు?

రఘు: ధనంజయతో దగ్గిరకెళ్ళి తిరిగివచ్చేటప్పటికి ఇంతపని జరుగుతుందనుకో లేదు నేను!

గంగ: అసలీక గాన్నెవడెచ్చింతరువాత ఎన్నడూ కొట్టినోళ్ళగాదయ్యావారూ! అట్టమాటనదినూరా నాయెంటరావొద్దు ఈదేశంలోనేపోతానని సెప్పుతంటే పట్టలేకపోయినా నాగ్గరం (నెత్తిమోదుకొని) నా తరాతరాల నెత్తురులుకాకేస్తు కొట్టేసినాను, పాపాత్ముణ్ణి — కాపిడిబడ్డతోటి— కడియ్యావారూ!

రఘు: కొడితే కొట్టావుగాని తనసంగతి తానాలోచించుకోనియ్యకుండా తెలివెందుకు పోగొట్టేశావు వీడికిలా?

గంగ: దెబ్బతో ఆడు కూలబడిపోతే నాకేమీ తోచినాదికాదు — ఎత్తుకెళ్లి పూరా నారాపట్టేపినాను, నొప్పి తెలీకుండా పోతాదని. పొద్దు కేలికి తగ్గిపోతాది.

రఘు: అయితే తీసుకుపోదల్చుకున్నావన్నమాట శివన్నని?

గంగ. అదేటయ్యావోరు? తమరు రాలేటి మాతో మనూరికి?

రఘు: నేనా? లేదు గంగన్నా, నాకేఊరన్నా ఒకటే! ఈ ఊళ్ళోనూ ఉన్నారు నా అవసరమున్నవాళ్ళు (చప్టాదగ్గర శివన్నదగ్గిర ఆగి) రజనీ సంగతి ఆలోచించేస్థితిలో లేవు నువ్వు! దానిగర్భంలో పెరుగుతూన్న శిశువు సంగతంతకంటే అక్కర్లేదు నీకిప్పుడు దరిద్రుడా!

గంగ: (ఆమాటలు వినీవినడంతోనే హాఠాత్తుగాలేచి నిలబడి) ఏటంటున్నారయ్యావారు?

రఘు: (గంగన్న దగ్గిరకువచ్చి ఎదుటనిలబడి) నీకొడుకుసంగతి నీకుకావాలి, కాని శివన్న కొడుకుసంగతి శివన్నకక్కర్లేకుండా చేసేస్తున్నావు నువ్వు!

గంగ: ఇదివరకేల సెప్పినారు గాదయ్యావోరీ సంగతినాకు?

రఘు: నాకూ ఇప్పుడే తెలిసింది, ధనంజయో చెప్పాడు.

గంగ: (ఆలోచించి) ఏమైనాసరే. శివుణ్ణిమటుకీడనే ఒదిలేసి యెల్లలేను నేను! (వెనక్కుతిరిగి పెట్టెతీసి డబ్బుల మూటతీసి) ఇదిగో అయ్యావారూ, శివుడీ నాలుగేళ్లలోనూ కూడబెట్టింది, ఆడికోడుకుకోసముప యోగించండి దీన్ని.

రఘు: (అందుకొని) నిజంగా డబ్బేగాని అయితే రజనీ స్త్రీత్వాన్ని అవ మానం చెయ్యడమన్నమాట ఇది తీసుకోవడం. కాదుగనుక తీసు కుంటానులే!

గంగ: (తెల్లబోయి) అదేటయ్యావారు?

రఘు: ఏమీలేదు — (అహుండీ, చప్టాకువేసి పగలగొడ్తాడు ఇనుపముక్కలూ రాళ్ళూ చెదురుతాయి.)

గంగ: ఆఁ — ఆఁ! (వంగబోతాడు)

రఘు: డబ్బులుకావు గంగన్నా అవి — ఇనపముక్కలూ, గవ్వలూ, రాళ్ళూ...(క్రిందికి వంగి ఏదో పైకితీసి) ఇదిగో ఒక్క రూపాయి మటుకు ఉంది వీట్లో!

గంగ: అయ్యావారూ!

రఘు: తనతండ్రికీ, కొడుక్కీ శివన్నచేసిన మోసానికి చిహ్నంగా జ్ఞాపక ముంచుకోడానికిది నీమనవడిమెళ్ళో కట్టానులే!

(తెరలోనుండి 'గంగన్నా — జైల్దేరు' అని కేకలు వినిపిస్తాయి.)

అదిగో పిలుస్తున్నారు నిన్ను! వెళ్ళు గంగన్నా!

గంగ: (ఎడమవైపు లోపలికిచూసి, మళ్లీ శివన్నవైపూ, పూజారివైపూచూసి, క్రిందికివంగి కావడి భుజానికెత్తుకుని, చప్టా దగ్గరకువెళ్ళి లాంతరు కావిడికి కట్టుకొని) అయ్యావారూ, శివుణ్ణి నాబుజంమీద పడుకోక్క బెట్టండి. (రఘునాథు వచ్చి శివన్నను ఎత్తి అందివ్వగా భుజంమీద

పడుకోబెట్టుకుని మధ్యకొస్తాడు లోపలినుండి "గంగన్నా... యేలవుతున్నాది, రా" అని కేక) వొస్తున్నా; దండాలయ్యావారు! (ఎడమ వైపుకు రెండడుగులు వేస్తాడు. ఇంతలో రజనీ వస్తుంది కుడివైపు నుండి.)

రఘు: నీ శిబో వెళ్లిపోతున్నాడు రజనీ!

(గంగన్న వెనుకకు తిరిగి రజనీని చూసి, ఆగి మళ్ళీ వెనక్కివస్తాడు. రజనీవైపు పరీక్షగా చూసి, చిన్న చిరునవ్వునవ్వి.)

గంగ: నీకోసమేనన్నమాట నన్నెదిరించినాడియాల నాసివుడు, కూచో రజనీ......ఇంతబరువు మొయ్యలేక పోతుండాను. కూచో!

(రజనీ తెల్లబోయి చూస్తుంది) కూచో ...... (రజనీ కూర్చుంటుంది క్రింద.) రండయ్యావారూ, ఈ కావిడిదింపండి. (రఘునాథు వచ్చి కావిడి దింపగా శివన్నని రజనీ ఒళ్లో పడుకోబెట్టి) ఈయేలనుండి ఈడి పూచీ నీదే, నీసివో యీడింక! (కళ్లలో నీటిచుక్కలు వ్రేళ్ళతో మీటుకుని, పెట్టె తీసి డబ్బులమూటతీసి) ఇదిగోటయ్యావారూ! అనుమానించమోకండి -- తాత యిచ్చినాడని సెప్పండి.

రఘు: అంతా యిచ్చేస్తున్నావా గంగన్నా?

గంగ: లేదయ్యావారూ ... దారిబత్తేని కని యేరుగా ఉంచినానులెండి! తీసుకోండి.

రఘు: (జాలిగా అందుకుని) నువ్వు ఉండిపో యిక్కడే గంగన్నా!

గంగ: (రఘునాథువైపు చూసి నవ్వి) నేనా? సేపలాటోణ్ణి నేనున్నా... కదయ్యావారూ! ఈ నాలుగేళ్లే ముల్లమీదున్నట్టుండినానీకాడ! (లోపలినుండి "గంగన్న — గంగన్నా అని కేకలు.) యెల్తాను, దండాలండయ్యావారు!

(గంగన్న వంగి శివన్నని ముద్దాడి, రజనీతలపైచేయిపెట్టి మనసులో దీవించి కావిడి బుజానికెత్తుకొని మాట్లాడకుండా ఎడంవైపుకు వెళ్ళిపోతాడు జిగ్నీ వస్తుంది కుడివైపునుండి.)

జిగ్నీ: ఉత్త చేతుల్తో అందరితోపాటు ఎళ్ళిపోతున్నావా తాతా!

(తెర) — సమాప్తం.

# తెగని బంధాలు



రచన

'గౌరి'

పాలగుమ్మి సుమతి

# పాత్రలు.



సత్యం: వయస్సు 25 సంవత్సరాలు.

సూర్యం: సత్యం మేనమామ కొడుకు.
వయస్సు 16 సంవత్సరాలు.

కరణం: వయస్సు 50 సంవత్సరాలు.

మాలక్ష్మి: వయస్సు 35 సంవత్సరాలు.
చిన్నప్పటినుండీ సత్యం తాత
గారింట్లో పెరిగిన మనిషి.

రంగమ్మ: సత్యం మేనత్త. వయస్సు
దాదాపు 40 సంవత్సరాలు.

# తెగని బంధాలు

## మొదటి రంగం

---

కరణంగారి కచేరిసావిడి. కరణం బల్లదగ్గర కూర్చుని వ్రాసుకుంటూ ఉంటాడు. అడుగుల చప్పుడికి తలెత్తి, జారిన కళ్ళజోడు సవరించుకుని గుమ్మంకేసి చూస్తాడు.

ప్రవేశం సత్యం(చేతిలో సూట్ కేస్‌తో)

కర: ఎవరదీ?

సత్య: (నమస్కారం చేస్తూ) జ్ఞాపకంలేదాండి (అంటూ కూర్చుంటాడు)

కర: (పరీక్షగాచూసి) ఓరి నువ్వటోయ్! ఎవరో అనుకున్నాను. బాగా మారిపోయావు సుమీ. అమ్మా, చెల్లాయి అంతా కులాసాయేకాదూ! ఎన్నేళ్లయిందీ! అంతా తలో దిక్కుకి చెల్లాచెదరు అయిపోయారు. ఈ మధ్య మీసంగతులే తెలియటంలేదు. మీమామయ్య ఉన్నాడన్న మాటేగాని, ఓమాటా మంతా? వెనక ఉన్న ఉద్యోగంలోనే ఉంటున్నావా?

సత్య: ఆc అందులోనే ఉంటున్నానండి.

కర: బాగుంది. సుఖంగా నెలతిరిగేప్పటికి నాలుగురాళ్ళు చేతిలో పడతాయి.

సత్య: ఏంబాగులెండి? పట్నవాసంలో జీవితం. ఈ పదిహేనవ తారీకు దాటినప్పటినుంచి తిరిగి ఫస్టు ఎప్పుడొస్తుందా అని కనిపెట్టుకు కూచోడం.

కర: సరేగాని, చెల్లాయికి సంబంధాలు ఏమైనా చూస్తున్నావా?

సత్యా: ఆఁ సంబంధం సిద్ధంగానే ఉందండి. అసలయిందే లేదు. ఇక్కడున్న పొలం ఏదో వదలగొట్టేసి ఈ మాఘమాసంలో అయిందనిపించేద్దాం అని అనుకుంటున్నాను.

కర: (ఏదో ఆలోచిస్తూ) ఏమిటి భూమి అమ్మేదామనా? ఇంకెవరి దగ్గరా అనకు. అవసరంకొద్దీ అమ్ముకుంటున్నామంటే వచ్చే ధరరాదు. నేను వాకబు చేస్తాలే.

సత్యా: ఏదో పెద్దలు శ్రమ ఇస్తున్నాను. మామయ్యమీద ఆశ ఏమీ లేదుగా

కర: మామయ్య సంగతి విన్నావుగా! ఆ మాలక్ష్మిని...

సత్యా: ఆఁ తెలిసింది. మామయ్య ఇల్లా అవుతాడు అనుకోలేదు ఏదో బయట ఏమి ఏడిసినా ఎవరికీ అట్టే అనిపించలేదు.

కర: (అందుకుని) ఇంట్లో పనిమనిషినే పెట్టుకుని ఆ మహా ఇల్లాల్ని పుట్టింటికి తోలేశాడు. ఎటువంటి బుద్ధులుపుట్టాయో చూశావా? అది కాస్తా వాణ్ణి వేలిచుట్టూ తిప్పుకుంటోంది. ఇంకొంచెం రోజుల్లో చిప్ప చేతికిస్తుంది.

సత్యా: ఈ కుటుంబానికి చెడ్డరోజులు వచ్చాయి.

కర: మీతాత ఉండేప్పుడు ఎల్లా ఉండేది! గాదినిండా ధాన్యం, ఇంటినిండా సిరీ, సంపదా కలకల్లాడుతూ ఉండేది. ఊళ్ళోకి పెద్దవాళ్లు ఎవరొచ్చినా మకాం మీతాత ఇంట్లోనే. పైగా ఎంతమందిని దగ్గర తీసి ఆదరించాడు! మీ అమ్మమ్మ! మహా ఇల్లాలు. ఆ మాలక్ష్మిని తల్లి తండ్రి చచ్చిపోతే చిన్నప్పటినుంచీ ఆవిడేగా కన్నకూతురులా పెంచింది. అది తక్కువజాతిదిఅయినా ఎప్పుడైనా ఆ తేడా చూపించిందా! అంత చేసినా అది ఎల్లా తయారయిందో చూశావా?

సత్యా: ఏమండీ ఏదో గాలికబుర్లలాగ విన్నాను గాని, మామయ్య వ్యవహారాలు ఎల్లా ఉన్నాయండీ?

కర: ఏముందినాయనా మీమామయ్యే సగం ఆస్తి అమ్మి తగలేశాడు. ఇంకే మన్నా మిగిలింది అదివేసుకుంది. ఇంక ఇల్లు ఒకటీ మిగిలిందేమోమరి.

సత్య: ఇంకా సూర్యానికి దక్కేది ఆ ఇల్లు ఒకటే ఏమో!

కర: పాపం కుర్రాడు చదువు సంధ్యలేకుండా వాళ్ళమ్మతోటే ఉంటున్నాడు.

సత్య: ఏమిటో నాకేమీ బాగోలేదు. మామయ్య ఇల్లాంటివాడు అవడం, అత్తయ్య ఇల్లువదలి పుట్టింటికెళ్ళడం, దీనికంతకీ ఆ మాలత్మే కారణం. తిన్నయింటికే వాసాలు లెక్కపెట్టింది. పండులాంటి సంసారం చెట్టూ పుట్టా పట్టింది.

కర: ఎంతకైనా తగును అది. మీతాత ఎవణ్నో తెచ్చి పెళ్ళిచేస్తే, పొయ్యే కాలం, వాణ్ణి కాస్తా వదిలేసింది.

సత్య: (లేచి సూట్‌కేస్ పట్టుకుని) ఇంక వస్తానండి. నేచెప్పినది కొంచెం వాకబు చెయ్యండి.

కర: (లేస్తు) అదేమిటోయ్ వెళతానంటావ్. భోజనం అదీ చేసి వెడుదు గాన్లే మామయ్య దగ్గరికి.

సత్య: మా తండ్రిపోయాక చిన్నప్పటినుంచీ నేపెరిగిన ఇల్లు అది. ఆయింటిని చూడాలని ఉందండీ, భోజనం మాటకేమిలెండి మధ్యాహ్నం వస్తా తీరుబడిగా మాట్లాడుకుందాం.

(సత్యం మెల్లిగా వెడుతూంటే తెర)

---

## రెండవ రంగం

(తాతగారి ఇంట్లో మా లక్ష్మి ఉండేగది.)

(బీద సంసారంలా కనిపిస్తూ ఉంటుంది. కాని శుభ్రంగా ఉంటుంది. ఓమూల కుండతో నీళ్ళు, దానిమీద గ్లాసు, ఇంకోపక్క నులకమంచంమీద జంబుఖానా పరచిఉంటుంది. ఓపక్కని దండెంమీద చీర వేసి ఉంటుంది. తెరఎత్తగానే స్టేజి ఖాళీగాఉంటుంది.)

(ప్రవేశం సత్యం ఎడమవైపునుండి)

సత్యం: ఎవరూలేరా ఏమిటి కొంపలో కిటికీలుతలుపులకి తాళాలువేసిఉన్నాయి. (వినుక్కుంటూ) ఇక్కడా ఎవరూలేరులాఉంది.

(ప్రవేశం మాలక్ష్మి చామంచాయ ముఖాన్ని, పెద్దబొట్టు, ఒంటినిండా నగలు. మనిషి సంసారిలా ఉంటుంది. మాట్లాడేప్పుడు గొంతులో పెద్దమనిషి తరహా వినిపిస్తూంటుంది.)

మాల: మనిషి బాగా మారావుకాని, సత్యంబాబూ నీ చిరాకుమాత్రం మారనే లేదయ్యా.

సత్యం: మనుషులు మారక ఏంచేస్తారులే, మహామహావాళ్ళే మారిపోతున్నారు. (కొంచెం ఆగి) నీసంగతి చెప్పుదూ? మామీద ఎంతప్రేమ నటించే దానివి? ఇప్పుడు ఎల్లాఉన్నావో చూసుకో!

మాల: (నవ్వు ఆపుకుంటూ) చెప్పొదుగాన్లే తరువాత, ముందర అమ్మగారు, చెల్లెమ్మ ఎల్లా ఉన్నారో చెప్పూ.

సత్యం: నీకెందుకులే వాళ్ళ బాగుఓగులు. ఎల్లాగో ఓలాగ ఉంటారు.

మాల: ఏమి ఎగిరిపడుతున్నావ్ సత్యంబాబూ. ఆఁ మేనమామపోలిక ఊరికే పోతుందా ఏమిటి!

సత్య: మేనమామ పోలికలు నాకేమీ రానక్కరలేదు. ఆపోలికలేవో మామయ్యే ఒక్కడే ఉంచుకుంటే మంచిది.

మాల: అది సరేకాని పొద్దున్నే ఏమన్నా తినివచ్చావా? కాల్చిన మొక్కజొన్న పొత్తులున్నాయి. తిందుగాని (కుడివేపునుండి లోపలికి వెళ్తుంది. సత్యం ఒకసారి తటపటాయించి నులకమంచంమీద ఒక మూలగా కూర్చుంటాడు. మాలక్ష్మి ఒక ఆకులో కాల్చిన పొత్తులూ, గ్లాసులో పాలు తెచ్చి దగ్గర పెడుతుంది.)

సత్య: నాకేమీ అక్కరలేదు. నాకు ఆకలిగా లేదు. వచ్చేటప్పుడు కరణం గారి ఇంట్లో ఫలహారం చేశానులే.

మాల: కరణంగారింట్లో పొద్దున్నే ఫలహారాలు ఎప్పట్నించి చేస్తున్నారు? అలవాటు తప్పించి చద్దెన్నంతిని వచ్చావేంటి వారింట్లో. (నవ్వుతుంది)

సత్య: ఇదిగో! నాతో వేళాకోళాలాడకు మరి. చిరాకెత్తుతుంది. నీతో ఇచ్చకాలు ఆడేందుకు రాలేదు నేను. వ్యవహారాలమీద వచ్చాను. మామయ్యేడీ?

మాల: మీమామయ్య పొలంలోకి వెళ్లారు చీకటితోటే.

సత్య: ఇంకా మామయ్యకి పొలంకూడా ఉందా? (ఈసడింపుగా) పనికేనా? లేకపోతే అక్కడింకెవత్తైనా ఉందా నీలాగ?

మాల: మంచి కబుర్లే నేర్చావు సత్యంబాబూ. ఎవరు నేర్పారోకాని. చిన్నప్పుడు చాలా అమాయకుడిలాగ ఉండేవాడివి. అబ్బో (ఆగి) నీకు ఒక్కకోపం ఎక్కువగా ఉంది. పొద్దుటినించి ఏమీ కడుపులో పడ్డట్టులేదు. (బతిమాలినట్టు) తరువాత కోపం చూపెడుదువుగాని. నామాటవిని ఆపాలేనా తాగేశెయ్యి.

సత్య: నేను నీదగ్గర విందులు కుడవడానికి రాలేదు అని చెప్పానుగా. మామయ్యతో పనుంది ఎప్పుడొస్తాడు?

మాల: నాతో చెప్పాదూ ఆపనేమిటో మామయ్యతో చెప్పక్కర్లేదు.

సత్య: సరే నీతోనే చెప్తాను. నాభూమి అమ్మేస్తున్నాను. నువ్వుకొను క్కుంటావా?

మాల: ఓసి అదా? నాకు అమ్మడం ఎందుకయ్యా? ఊరికే ఇచ్చెయ్యక.

సత్య: (కోపంగా) ఊరికే అందరివీ వేసుకోడం అలవాటయింది. (పళ్లు కొరుకుతాడు.)

మాల: (నవ్వుతూ) సరేగాని అసలువిషయం చెప్పావుగాదు?

సత్య: చెప్పానుగా. నాభూమి అమ్మివేద్దామని వచ్చాను. దాని తాలూకు కాగితాలు మామయ్యదగ్గరున్నాయి. తీసుకోవాలి.

మాల: (నిర్ఘాంతపడి) ఏమిటీ! భూమి అమ్ముతావా? నీకేమన్నా, మతిగాని పోయిందా? ఈ అమ్మకోడాలు ఎక్కణ్ణుంచివచ్చాయయ్యా మీకు?

సత్య: నాయిష్టమొచ్చినట్టు చేసుకుంటూ నీకెందుకు?

మాల: మంచి ప్రయోజకుడివే. పెద్దలు సంపాదించినదానిమీదే నీఅధికారం?

సత్య: పెద్దలమీద నీకుచాలా గౌరవంకాదూ? అందుకే వాళ్ల పరువంతా ఇలా బుగ్గిపాలు చేశావు.

మాల: అయితే ఆపోయిన పరువు ఈభూమి అమ్మి కొందామని చూస్తున్నా వేమిటి?

సత్య: (కొంచెంతగ్గి) నీతో అసలు చెప్పక్కర్లేదుగాని. మా చెల్లాయి పెళ్ళికి సంబంధం స్థిరపడిఉంది. చెయ్యడానికి డబ్బుకావలి. లేకపోతే సంబంధం దాటిపోతుంది.

మాల: పెళ్లికోసం ఉన్న భూమంతా అమ్మకోడం ఎందుకు?

సత్య: మరి కట్నం పొయ్యద్దూ?

మాల: మీరంతా సదువుకున్నోళ్లు కాదయ్యా ఇంకా కట్నాలెందుకు?

సత్య: చదువు ఎక్కువయినకొద్దీ కట్నం పెరుగుతోంది.

మాల: అయితే నువ్వుకూడా తీసుకుంటావా?

సత్య: నేతీసుకునే మాటయితే, అది పుచ్చుకునే చేద్దును పెళ్లి చెల్లాయికి. పొలం అమ్మకోడం ఎందుకు?

మాల: పొలాలూ, ఇల్లూ వదులుకుని పట్నాలుపట్టి పోడమే బాగులేదు. ఇప్పుడుఉన్న ఆ ఆధారంకూడా లేకుండా చేసుకుంటే ఎల్లాగయ్యా?

సత్య: ఈ నీతులన్నీ తెలిసేలాగుంది. అన్నీ అమ్మిపారేయించేశావు మామయ్యా చేత? మాకుటుంబంమీద ఇంతే గౌరవముండేనా ఇంత వరకూ తీసుకొచ్చావు? అత్తయ్యనికూడా ఇంట్లో ఉండనివ్వకుండా వెళ్ళకొట్టావు.

మాల: ఆగాగు. మరీ! మీమామ పొలాలమ్ముకుంటే ఆతప్పు నాదేంటయ్యా? నేంచేసేదేముంది. ఒక్కగానొక్కకొడుకని గారం చేసేసరికి అలా గయ్యాడు ఆయనె.

సత్య: తాతయ్యమీద కూడా విరుచుకుపడుతున్నావా నీగొప్ప మండిపోయి నట్లు. అయినా నీ మొహంలో ఏంచూశాడో మామయ్యమరి!

మాల: (నవ్వుతూ) అదేమాట! నాకేంలోటయ్యా. మీఅత్తయ్య బాగుం టుందా? నేబాగుంటానా చెప్పు? మీఅత్తకీ తలకాయి తిన్నగా దువ్వుకోడమేనా చాతవునా?

సత్య: మా అత్తయ్యకున్న అందంచాలులే.

మాల: చాల్లేద నేనయ్యా నేనంటూంట. చాలే ఇంటోనే ఉంచుకున్న మీమామయ్యని.

సత్య: అది, మా అత్తయ్యలో ఏముంది? పాతకాలపు సంసారి.

మాల: సంసార్లుట. సంసార్లు!! మీ అమ్మమ్మా సంసారే. ఆవిడ పాతకాలపు మనిషే. ఆవిడలాగే నడపగలిగిందా సంసారం మీఅత్త! ఆవిడ కాలి గోరుకేనా పోల్తుందయ్యా?

*సత్య: అమ్మమ్మమీద అంత ప్రేముండేలాగుంది ఆవిడ నగలన్నీ పెట్టుకుని కులుకుతున్నావు?.

మాల: (కులుకుతూ) అసలు ఈ నగలు నాకేబాగుంటాయయ్యా. ఏంటయ్యా ఈఇంట్లో కూతురిలాగ పెరిగి కోడలి అధికారం సాగిస్తున్నాను.

సత్య: నువ్వు సిగ్గూ బిడియం అవీ ఒదిలేశావుస్మా. అసలు నీతో ఇంత సేపు ఎందుకు మాట్లాడుతున్నానో నాకే తెలియదు.

మాల: సత్యంబాబూ! నువ్వెందుకయ్యా ఎగిరిపడతావు. అయినా కాని మన మెందుకయ్యా పోట్లాడుకోడం? కాని ఆభూమి బేరంపెడ్తే మాత్రం నేనెవ్వణ్ణీ కొనుక్కోనివ్వను.

సత్య: అదికూడా నువ్వే వేసుకుందామనా?

మాల: అలారా దోవకి. నీభూమి నాపేర కౌలురాసెయ్యి. నీడబ్బుసంగతి నేచూస్తాను.

సత్య: (మండిపోతూ) కౌలుకాదు నీమీద కవిత్వం రాస్తాను.
(ప్రవేశం హడావిడిగా కరణం. మాలక్ష్మి లోపలికి తప్పుకుంటుంది)

కర: మీమామయ్య వస్తూ వస్తూ హఠాత్తుగా గుండె ఆగి పడిపోయాడు. త్వరగా పదనాయనా! (మాలక్ష్మి కంగారుగా వస్తుంది.)

మాల: నువ్వొక్కడికెళ్ళు బాబూ. నేవెళ్ళి వైద్యుణ్ణి తీసుకొస్తాను. (నిష్క్రమణ)

(తెర)

## మూడవ రంగం

(తాతయ్య ఇల్లు, పుస్తకాల అలమార, కొన్ని పుస్తకాలు కింద ఉంటాయి. సూర్యం పుస్తకాలు సవరిస్తూ ఉంటాడు. అత్త వత్తులు చేస్తూంటుంది. సత్యం దిగులుగా కూర్చుని ఉంటాడు.)

సత్య: పాపం హఠాత్తుగా పోయాడు మామయ్య. అన్నీ పూర్తి అయిం జాకా చాలా క్షేమంగానే ఉంది.

అత్త: (అసహ్యంతో) ఛీ. దానిమాట నాదగ్గరెత్తకు, దానిమూలాన్నే కొంప అంతా నాశనం అయింది

సత్య: ఏమో అత్తా మన బంగారం మంచిదవాలిగాని, ఇంకొకళ్లని అనుకుని ఏంలాభం?

అత్త: ఇదే ఏ మందో మాకో పెట్టింది. లేకపోతే రాయిలాంటి మనిషి, అంత హఠాత్తుగా ఎందుకుపోతారు!

సత్య: అబ్బె అదేంకాదు అత్తా. డాక్టరు పరీక్షచేశాడు కాదూ? గుండె హఠాత్తుగా ఆగిపోయింది.

(సూర్యం ఒక లావు పుస్తకం పుచ్చుకుని సత్యం దగ్గరికి వస్తాడు.)

సూర్య: ఇదేమి పుస్తకం బావా?

సత్య: (చదివి) ఇది కుమారసంభవం, కాళిదాసుది. తాతయ్య ఎంత బాగా చదివి చెప్పేవాడు! హిమవత్ వర్ణన, శివపార్వతీ సంవాదం, అన్నీ కళ్ళకు కట్టినట్టు వ్యాఖ్యానించి చెప్పేవాడు. చదవడం పూర్తిఅయిన తర్వాత పుస్తకాన్ని ఆప్యాయంగా చూస్తూ "ఒరేయి మీరంతా పెద్దయాక ఇవన్నీ చదివి మీపిల్లలికి చెప్పాలిరా" అనేవాడు. ఒరే సూర్యం నువ్వు కాళిదాసు పేరు ఎప్పుడన్నా విన్నావురా?

అత్త: ఆఁ కుర్ర నాగమ్మా, వాడికేం తెలుస్తాయి? ఆఁ వీడినాన్న చదవారుగా ఇవన్నీ. స్వయంగా దగ్గర కూచోపెట్టుకుని మీ తాతయ్య చదివించే వారుట కూడా! ఏం ముందుకొచ్చారేమిటి? ఎందుకొచ్చిన చదువులు!

సత్య: అది చదువులో దోషం కాదు అత్తా. చదువుని వినియోగించుకొనే వివేకం ఎవరిస్తే వస్తుంది?

సూర్య: (ఇంకో లావు పుస్తకం పట్టుకొచ్చి) బావా ఈ పుస్తకం ఏమిటో చూడు. లావుగా ఉంది. మంచి ఖరీదు ఉంటుదా?

సత్య: ఇది ఒక జర్మన్ వేదాంతి రాసిన గ్రంథం. ఎక్కడినుంచో తెప్పించానని చెప్పేవాడు. ఇప్పుడీ పుస్తకం ఎక్కడా దొరకదు.

సూర్య: (సంతోషంగా) చూశావా నేను సరియైనవే ఏరుతున్నాను.

సత్య: (ఆశ్చర్యంగా) ఎందుకురా చదువుదామనే?

సూర్య: అబ్బె అమ్మితే బాగా డబ్బు వస్తుందని. డబ్బు వచ్చేవి ఏవో అమ్మేసి, మిగిలిన ఈ చెత్త తాటాకు పుస్తకాలు చలిమంట వేస్తాను.

సత్య: గొప్ప పనిచేస్తావ్. చలిమంటకాదు, నాలిక గీసుకో వాటితో. అప్పుడేనా కాస్త 'సరస్వతి' కటాక్షిస్తుందేమో.

అత్త: చదువుకోవలసిన కర్మం వాడికి పడుతుందనుకోలేదు. నేను ఈయింట్లోకి వచ్చేప్పటికి ఎంత ఆస్తి ఉండేది! ఉన్న కొడుకు ఒకడికీ చదువు లేకపోతే కొంపమునిగిపోతుందని, రాజమండ్రీలోను, విశాఖపట్నంలోను పెద్ద కాపురాలు పెట్టి బోలెడు తగలేశాడు ముసలాయన. ఈ రోజున ఈ కుర్రకుంక చదువుకుని సంపాదించవలసిన కర్మ ఏర్పడింది.

సత్య: ఏం అత్తా, చదువుకుని సంపాదిస్తే గౌరవలోపమా ఏమిటి? పెద్దలు సంపాదించి యిచ్చిన ఆస్తిని కరిగించుకు తినడమే గౌరవమా?

అత్త: ఆ ఉన్నాయిగా ఆస్తులు కరిగించుకోడానికి, ఎలాగయితే మిగిలింది ఈ పాతకొంప ఒకటే. ఇంటినిండా చెత్త పుస్తకాలు, స్థలం ఆక్రమించుకుంటూ వెర్రి మంచాలూ, బండకుర్చీలూ...

సత్యా: ఆ కుర్చీలోనే ఎప్పుడూ తాతయ్య కూచునేవాడు. అది అమ్మమ్మకి పుట్టింటివారిచ్చిన పందిరి మంచం, ఇవన్నీ ఆరోజుల్ని జ్ఞప్తికి తెస్తున్నాయ్. నువ్వు వెళ్ళినతర్వాత మాలక్ష్మి వీటిని వాటిస్థానాల్లోంచి కదపకుండా అల్లాగే జాగ్రత్తగా అట్టే పెట్టింది. అది ఎలాంటిదైనా ఈ గదులు, ఈ సామానులు ఏమీ వాడినట్టూ కనబడదు.

అత్త: జాగ్రత్త అంతా పడేసుకుందామని, ఎందుకొచ్చిన సామాన్లు ఈ మంచాలు, కుంచాలు అయినకాటికి అమ్మిపారేస్తాను.

(ప్రవేశం మాలక్ష్మి, వంటిమీద నగలుండవు, చేతిలో మూట)

సూర్య: (తొందరగా) మాలక్ష్మి మన దొడ్లో ముంజిలు ఉన్నాయా?

మాల: ఉన్నాయి బాబూ, పాలేరు కొట్టిస్తాడు. ఎళ్ళు.

(సూర్యం పుస్తకాలు క్రింద పారేసి వెళ్తాడు. మాలక్ష్మి నెమ్మదిగా నేలమీద పుస్తకాలని ఏరి జాగ్రత్తగా అలమారులో పెడుతూ)

మాల: అమ్మతానంటున్నారేమిటి రంగమ్మగారూ?

అత్త: నాయిష్టమొచ్చినది, అడగడానికి నువ్వెవరు? అసలు నువ్వా అలమారు దగ్గరికి ఎందుకు వెళ్ళావు? అందులో విలవైన పుస్తకాలు ఉన్నాయి.

మాల: ఆ విలవైన పుస్తకాలు నేలమీదపడి దొర్లుతున్నాయి, అందుకని జాగ్రత్త పెడుతున్నా.

అత్త: ఆ జాగ్రత్త పెట్టుకోడం మాకు తెలుసులే.

మాల: అవును అన్నీ తెలుసుననుకుంటాం మనం, ఆఖరికి ఇంటి గౌరవం నిలబెట్టుకోడమైనా తెలియదు. ఈ అమ్ముకోడం అలవాటు ఈనాటిదా రంగమ్మగారూ. ఆపూట చిరితిండికోసం, తెలియకుండా ఇంట్లో బియ్యం, పప్పులూ -- ఒకటేమిటి చేతికి ఏదిఅందితే అదే వెళ్ళిపోతుండేది దొడ్డిదోవని. ఇంటి ఇల్లాలు ఇల్లా చేస్తుంటో ఏసంసారం ముందుకొస్తుంది? ఇప్పుడు ఈ కుర్చీలు, మంచాలు, పుస్తకాలు ఇవి కనిపిస్తున్నాయి అమ్ముకోడానికి.

అత్త: (ముఖం ఎర్రబడిపోతుంది. కోపంతో గొంతు వణుకుతుంది) చూశావురా సత్యం. ఎల్లా పేలుతోందో.

(సత్యం ఏదో అనబోతాడు. అత్త తిరిగి అందుకుంటుంది) ముందర బయటికి పో!

మాల: (శాంతంగా) రంగమ్మగారూ! పెద్దయింట్లో చిన్నప్పటినుంచీ పెరగబట్టి మిమ్మల్ని అలుసుగా మాట్లాడలేను. కాని మీరు అన్న మాటే నేనూ అనగలను.

అత్త: (ఆవేశంతో) ఏమిటి నన్నే బయటికి పొమ్మంటావా? ఈయిల్లునీదా?

మాల: అవును నాదే.

(అత్త, సత్యం వెళ్ళిపోతారు)

సత్య: (మెల్లిగా) ఈ ఇల్లు నీది ఎల్లాఅయింది మాలక్ష్మీ?

మాల: నాకు ఎవరూ ఇవ్వలేదు. నేను కొనుక్కున్నాను. మీమామ దీన్ని తనఖా పెట్టి తీర్చలేకపోతే నేను కొనుక్కున్నాను.

సత్య: నీకు డబ్బు ఎక్కడిది?

మాల: తాతగారు నా పెళ్ళినాడు పసుపు కుంకంగా రెండెకరాలు రాసి ఇచ్చేరు. అది అమ్మేశాను. కావలిస్తే కాగితాలు చూపిస్తాను.

అత్త: (ఏడుస్తూ) అయితే నేపోతాను ఈ యింట్లోంచి, ఈ కొంపా లేకుండాచేసి చచ్చాడు.

మాల: మీరు వెళ్ళక్కరలేదు రంగమ్మగారూ. ఈ యింట్లో నాబోటి దిక్కులేనివాళ్ళకే ఎందరికో ఆశ్రయం దొరికింది. నన్ను మీతాత గారు పెంచిపెద్దచేసి స్వంత కూతురిలా పెళ్లిచేశారు. పెళ్లిఅయాక కూడా నేను ఈ యిల్లు వదిలేకపోయాను. దొడ్లో పాకలో వాడు నేనూ ఉండేవాళ్ళం. ఈ యింటితో ఒకబంధం ఏర్పడిపోయింది. పెద్దవాళ్ళుపోయాక, మామ ఇష్టమొచ్చినట్టు తిరిగి ఆస్తి పాడుచేయడం మొదలెట్టాడు. ఒక ఎకరం తర్వాత ఒక ఎకరం కరిగిపోతూవచ్చింది.

సిరి, సంపదలతో కలకల్లాడుతూ ఉండే ఈ యిల్లు నాకళ్ళముందే నాశనం అయిపోతుందేమో అని భయంపట్టుకుంది. రాత్రుళ్ళు నిద్ర పట్టేదికాదు. ఇంతలోనే మీమామ ఎవర్తెనో తీసుకొచ్చి పక్క వీధిలో పెట్టాడు. ఇంక మనస్సు ఉండబట్టలేకపోయాను. పోలిగాణ్ణి వదిలేశాను. మీమామయ్య మళ్ళీ ఆరోజునుంచి ఇల్లుకదల్లేదు. అసలు మొదటినుంచీ నామీద కన్నుంది మీమామయ్యకి. నలుగురు నాలుగు విధాల అనుకున్నారు. నన్ను ఆదరించి, పెంచి పెద్దదాన్ని చేసిన ఈ కుటుంబం నాశనం అయిపోకుండా అప్పట్లో నాకు ఇంకోమార్గం కనిపించలేదు. అప్పటికే చాలా భూములు తనఖాలో ఉన్నాయి. ఎల్లాగో 20 ఎకరాలభూమి, ఈ ఇల్లు నా పేర కొనకలిగాను. మామయ్య పోగానే ఇంక నేచేయవలసింది ఏముంది చెప్పు. నిన్ననే సూర్యంపేర, ఈ ఇల్లు, భూమి, రాసేసి రిజిష్ట్రీ చేయించేశాను. సూర్యం పెద్దవాడయేవరకు భూమి కవుళ్ళు నీపేరే వ్రాయించాను సత్యం బాబూ, ఈలోగా అతని చదువు సంధ్య చూడు. అమాయకుడు పాపం.

సత్య: ఇక్కడ నా వ్యవహారం అవగానే సూర్యాన్నికూడా తీసికెళ్ళి పోతాను. మాలక్ష్మీ నిన్ను ఏమిటేమిటో అన్నాను...

మాల: (వారిస్తూ) ఉండవయ్యా. వ్యవహారం అంటున్నావు, నీ భూమి అమ్మకు. మీ అమ్మమ్మగారి నగలు, మీ అమ్మకోసం దాచిపెట్టాను. వాటి అవసరం ఇప్పుడొచ్చింది. అవి తీసుకుని చెల్లెమ్మ పెళ్ళిచేసెయ్యి. పొలంజోలికి పోకు. నగలమూట ఇదిగో, భూముల తాలూకు కాగితాలివిగో. (మూట విప్పి ఇస్తుంది)

సత్య: (కొంచెం బాధగా) మరి నీకేమిటి మాలక్ష్మీ!

మాల: (జాలిగా) సత్యం బాబూ ఇక్కడ నాకింకేముంది. పోలిగాడు నేను వొదిలేశాక పట్నంపోయి కూలిపని చేసుకుంటున్నాడు. వచ్చెయ్యమని

కబుర్లు పంపుతున్నాడు. నేను అక్కడికే పోతా. పాపం మంచోడు ఆడు. దయఉంచు సత్యం బాబూ. బ్రతికి బాగుంటే ఎప్పుడో కలుసుకుందాం (బరువుగా అడుగులు వేసుకుంటూ వెళ్లిపోతుంది).

అత్త: ఎంతకైనా తగును ఇది. ఎంత నాటకమాడిందీ. అసలు ఇంకా ఎంత మిగుల్చుకుందో?

(సత్యం అత్తకేసి అసహ్యంగా చూస్తుంటాడు. మెల్లిగా తెర జారుతుంది.)

స మా ప్తం.

# వంశ దేవత



రచన

రాచర్ల దివ్య ప్రభాకర్.

# పాత్రలు.



సారథి:

డాక్టర్ బదరీనాథ్: సారథి స్నేహితుడు, ఇంటి డాక్టరు.

డాక్టర్ లోకనాథం: సారథి, బదరీల స్నేహితుడు, సారథి భార్య విషయంలో బదరీకి సలహాలిస్తుంటాడు.

శాస్త్రి: సారథి కొడుకు.

బాయ్: పనికుర్రాడు.

మామగారు: సారథి మామగారు. కాలేజి స్టూడెంటు.

శేషమ్మ: సారథి తల్లి.

తెరలో స్త్రీ కంఠం: సారథి భార్య, ఆమె జబ్బుమనిషి.

# వంశ దేవత

(స్టేజికి కుడిచేతిప్రక్క ముందుభాగంలో ఒక టేబిలు, ఒక కుర్చీ; ఎడంచేతిప్రక్క వెనుకభాగంలో ఒక చిన్న టేబిలూ, గుండ్రంగా తిరిగే కుర్చీ; ఆ టేబిలుమీద రెండు పరుసలు పుస్తకాలూ, కలం గిరాజుక్సి వగయిరాలుంటాయి. ముందు టేబిలుమీద మందులసంచీ, సిగరెట్టు టిన్నూ, ఫ్లాస్కూ, రెండు గాజుగ్లాసులూ వుంటాయి. గదంతా సిగరెట్టు పీకలూ, చిన్న చిన్న కాగితంముక్కలూ పడుంటాయి.

గుళ్ళను చిన్న సర్కిల్‌లోకి పంపించలేక అసంతృప్తితో అవస్థ పడుతూ నేలమీద కూర్చున్నాడు బుజ్జి.

పార్థసారథి సిగరెట్టు త్రాగుతూ స్టేజికి వెనుకప్రక్కగా పచార్లు చేస్తూంటాడు. అతనిముఖంలో ఆందోళన ముఖ్యపాత్ర వహించింది. విషాదంగా వుంటాడు. మాసిన గడ్డం, పెరిగిన జుట్టూ.)

డాక్టర్ బదరీనాథ్: (లోపలి గదివైపు తలుపుతీసుకుని వస్తాడు. మాసినగడ్డం ముఖం కొద్దిగా పాలిపోయి, కళ్ళెర్రగా వుంటాయి.)

సార: (అతను తలుపు తియ్యగానే ఆగి అతని ముఖంలోకి ప్రశ్నార్థకంగా చూస్తాడు.)

బదరీ: (సారథి ముఖంలోకి ఒకసారిచూసి, తలవంచుకుని రెండడుగులు ముందుకేస్తాడు.)

సార: (తీసివున్న గదితలుపువంక చూసి, భీతిగా) ముందా తలుపువెయ్ బదరీ!

బదరీ: ఊఁ?...ఊఁ...ఆగదికి కిటికీ ఎత్తుగావుంది. వెలుతురూ, గాలీ ఇలా వెళ్ళాలి.

సార: కాని ఇలా రావటానికి వీల్లేదు.

బదరీ: ఆ మనిషికి ఈగాలి సుఖంగా వుంటుంది.

సార: నాకు చాలా బాధగా వుంటుంది బదరీ!

బదరీ: హుఁ! (ఛీ!—అని తనలోపల అనుకున్నట్టుగా పైకే అంటాడు.) సారథీ! (మెల్లిగా) మనసులో ఏమూలన్నా చూడాలనుంటే వెంటనే వెళ్లు. తెలిసిందా? నీకే!

సార: ఊఁ?

బదరీ: (టేబిలుమీద పుస్తకాలు చూస్తూంటాడు.)

రాజ: పల్లెదాపున మంచి పంటచేనుంది
పల్లెలో అందాల పాపలున్నారు.
మా ఇంటిలో పాపమారాజబిడ్డ...
అదీ! అదీ, పడింది ... ఒకటిపడింది! ... పడ్డావా,
ముండ పడ్డావా! పదమా...పదమా ...

సార: (శూన్యంగా చూస్తూంటాడు)

బదరీ: అడుగుపట్టంలేదేం? ఈ పూట కండిషన్ నాకే అనుమానంగావుంది నా వుద్దేశం...ఇవ్వాళ...

సార: బదరీ!

బదరీ: సర్లెనీ! ఇంక ఈ నిమిషం బతికుండగా మళ్ళీరాదు. క్విక్!

సార: ...............

బదరీ: నామాట వినుసారథీ!

సార: ...............

బదరీ: (మళ్లీ పుస్తకంచూస్తూంటాడు.)

సార: (మెల్లిగా అడుగులు తడబడుతూ తలుపుదగ్గరకి వెడతాడు. తలుపు వెయ్యాలనో, లోపలికి తొంగిచూడాలనో అతనికే తెలీదు. సమీపిస్తున్నకొద్దీ అడుగులు బరువుగా పడుతుంటాయి. తలుపు దగ్గరగా వెళ్ళాడు. చూశాడు అంతే!) బదరీ! (అనికేకపెట్టి అడుగులు వెనక్కి వేస్తున్నాడు. ఆయాసపడుతున్నాడు )

బదరీ: ఏవిటది? ఏవిటది సారథీ?

బుజ్జి: నాన్నా! నాన్నా!

— (ఇంతలో తీసున్న వాకిలిగుండా నల్లచీర చెరగులూ, పమిటా కనుపిస్తాయి. శబ్దం..."ఏవండీ! ఏవండీ! ఎక్కడా?..." అని మూలుగు.)

సార: (మళ్లీ కేక) బదరీ! (పడిపోబోతాడు.)

బదరీ: (పట్టుకుని ఆపుతాడు. గుమ్మంవంక చూస్తూ, సారథిని వదిలేసి, గుమ్మం దగ్గరకు పరుగుతీసి ఆ వ్యక్తిని లోపలకు తీసుకెళ్ళి తలుపేస్తాడు.)

సార: (ఒణికిపోతున్నాడు)

బుజ్జి: (అర్థంకాక, అయోమయంగా తండ్రికాళ్లని చుట్టేసి వేళ్ళాడుతుంటాడు.) నాన్నా! నాన్నా!!

తెరలో స్త్రీ: ఉండండి! ఉండండి! ... నన్ను...వెళ్లనీండి...నన్ను ఆపకండి...వారిని...వారిని...చూడాలి...(మూలుగు.)

బుజ్జి: నాన్నా! అమ్మ! ... అమ్మా! అమ్మా! (తలుపు దగ్గరికి పరుగెత్త బోతాడు.)

సార: (పట్టుకుని) వెళ్ళకు ... వెళ్లకు బుజ్జీ! అమ్మే...మరే...మరే!... (మాటలు దొరకని అవస్థ.)

బుజ్జి: నాన్నా! అమ్మ...ఊఁ ఊఁ...నన్నొదులు...అమ్మదగ్గరికెడతా ... వొదులూ...అబ్బ ఒదులూ...(ఒక్క గుంజుగుంజి తలుపుదగ్గరికి పరుగెత్తుతాడు.)

బదరీ: (తలుపు తీసుకునివస్తూ) అరెరెరెరె! అటెళ్లకూడదు. ఊఁ! ... (బుజ్జిని ఇవతలకు లాక్కొస్తాడు.)

బుజ్జి: ఎందుకెళ్లకూడదు? నన్నొదులు...మా అమ్ముంది లోపల ... అమ్మా! (ఏడుస్తాడు)

సార: బుజ్జీ! ఇటుచూడు. అమ్మే...అమ్మ...

బసకీ: అబ్బే అలా ఏడవకూడదమ్మా...మా డ్రైక్లాసు చదివే అబ్బాయంటే ఎలా ఉండాలి!...టిప్‌టాప్‌గా...

బాయ్: (వచ్చాడు)

బసకీ: అరెరె! కమాన్ కమాన్! హాఁకాఁ? అదుగో...వచ్చాడు. కోటూ, హ్యాటూ, బొమ్మలూ తెచ్చాడు. అదుగో హ్యాటూ ... హహ్హహ్హ! భలే! భలేగ్గా వుందే టోపి! భలేవి తెచ్చావోయ్! మా బుజ్జి కోసమేనా?

బాయ్: అవునండీ! ... "మా బుజ్జీగారికి మంచివిమ్మండీ" అన్నాను. మంచివే, ఏరిఇచ్చాడు. చూడండీ తుతుతూబూరా...

బుజ్జి: అమ్మా! అమ్మా!

సాక: ఇవ్వండివ్వండి...వాడికవన్నీ ఇచ్చెయ్యండి...అన్నీనూ.

బసకీ: ఓ...అన్నీనూ...ఈ బ్యాగ్ బ్యాగునూ...

బాయ్: చూడండబ్బాయిగారూ! తుతుతూబూరా (ఊదుతాడు)

బసకీ: అదేవిటోయ్! ఎంగిల్చేశావ్? అబ్బే!

సాక: మీరూరుకండోయ్! అవి మా బుజ్జీవి...ఇవ్వండి అన్నీ.

బస: ఇవిగో...ఇవిగో...మా బుజ్జికివిగో...(చిందేస్తాడు)

బుజ్జి: (ఇందరు ఇంతగోలచేస్తున్నా తన గోలమాత్రం మానడు. 'అమ్మా!' అని పాటే.)

(ఎంత పట్టుకున్నా తలుపువేపు గుంజుకుంటాడు)

బస: అబ్బాయ్! నాకోపమొస్తుంది...

బుజ్జి: నీకోపమెందుకన్నా? మా అమ్మదగ్గిరకెడతానంటేనూ! ... వాళ్ల గోపాలు మామా...బరినించి రాగానే వాళ్లమ్మదగ్గిరకెడతాడు. నేను కూడా మా అమ్మ దగ్గిరికి...ఊఁఊఁ...అమ్మా.

సాక: బుజ్జీ!

బద: బాయ్! నువ్వెళ్ళి చాకోలెట్లూ, పిప్పర్ మెంట్లూ...

బుజ్జీ: అమ్మా! అమ్మా!

బాయ్: (వెళ్లిపోయాడు)

సార: అల్లరి మానేస్తావా లేదా?

బుజ్జీ: నన్నమ్మదగ్గరికి పంపిస్తే నే...అమ్మా!...

బద: ఓ! తప్పకుండా...రేపూ...తెలిసిందా? ... ఏం?

బుజ్జీ: ఎవళ్ళన్నా అమ్మదగ్గరికి రేపెడతారా యేం? ఎప్పుడుపడితే అప్పుడే వెడతారు గానీ...నన్ను పోనీ...అమ్మా!

తెరలో: (మూలుగు)

బద: (గబాగబా లోపలికెళ్ల బోతాడు)

బుజ్జీ: (ముందే పరుగెత్తుతాడు)

బద: (కసురుతూ) ఊ...

సార: (వాణ్ణిపట్టుకుని) ఒరేయ్! దెబ్బలుపడతాయ్.

బుజ్జీ: (కాళ్లతో బదరీని తంతాడు)

బద: (వెళ్ళిపోతాడు)

బుజ్జీ: అమ్మా చూడవే ఈ దెయ్యాలూ...అమ్మా! (గింజుకుంటూంటాడు.)

సార: (రెండు లెంపకాయలేసి) చెపుతూంటే నీక్కాదూ? వెధవా! ఇందాకట్నుంచీ...

(ఆటవస్తువుల్లో ఉన్న ఒకతాడుతీసి వాణ్ణి టేబిల్ లెగ్ కేసి కట్టేస్తాడు. బుజ్జీ ఏడుస్తాడు. కొంతసేపయినతర్వాత నిద్రపోతాడు.)

నిశ్శబ్దం.

బద: (వస్తాడు మెల్లిగా) ఈపని నువ్వేవుద్దేశంతో చేస్తున్నావో నాకైతే తెలీదుకానీ...ఇది గోంతుపిసికి చంపటంలాంటిది, తెలుసా?

సార: నా భావాన్ని నువ్వర్థంచేసుకోలేదు బదరీ!

బద: ఈ భావంలో శాంతికూడావుంటుందా?

సార: నువ్వూ జీవితాన్ని నా అంత మాధుర్యంగా గడిపివుంటే ఇలా మాట్లాడవ్.

బద: గడచిన దాన్ని తలుచుకుని గొప్పవాణ్ణనుకుంటూవెందుకూ?

సార: మరి? రాబోయేదాన్ని గురించి గాలిమేడలు కట్టమంటావా?

బద: ప్రస్తుతక్షణం ఎలాంటిదో ఆలోచించు.

సార: బదరీ! నువ్వు డాక్టరువి. నాతత్వాన్ని కనిపెట్టడంలో ఇంత అసమర్థత చూపిస్తున్నావేం?

బద: మనిద్దరం స్నేహితులం కావటం అందుక్కారణమేమో!

సార: బదరీ!

బద: (స్నేహితుని చెయ్యి పట్టుకుని, మార్దవంగా) సారథీ! ఇంతకంటే ఇంకేమీ చెప్పలేను. పద. (నీళ్ళు నములుతాడు. చెప్పాలనుకున్నది చెప్పలేకపోతాడు. కళ్లలో నీళ్లు తిరుగుతాయి.) సారథీ! ఇంకోగంట తర్వాత ఆ ప్రాణం ఉండచ్చు, ఉండకపోవచ్చు, ఈ ఒక్కసారీ... చూడు సారథీ!...ఒక్కసారిరా...

సార: (బదరీ కళ్లలో నీళ్లుచూసి ఖిన్నుడై, మెల్లిగా) బదరీ! ఏమిటిది? అనవసరంగా బాధపడకు...బదరీ! రాలేను... నేను రాలేను బదరీ!...

బద: రావాలి...తప్పదు...రా సారథీ!

సార: రాలేను...ఒక్క నిమిషం కూడా ఆగదిలో ఉండలేను ఆగాలి పీల్చలేను...కనీసం...ఆగదిలో ఏ వస్తువునీ కూడా చూడలేను...చూడు బదరీ! ఈ కళ్ళు వారంరోజుల క్రిందటివరకూ అందాన్నే చూశాయ్ లోకమంతా అంతే ననుకున్నాయ్...ఇవ్వాళ...ఇలా ...భయంకరంగా...(భీతితో) బదరీ!...చూళ్ళేను. చూళ్లేను బదరీ!

బద: ఏం? ఈ రోగాన్ని, భయంకరంగా ఉండే ఆ ముఖాన్ని చూసి సన్యసించవలసి వస్తుందేమోనని భయమా?

సార: (స్నేహితుని సూదిపోటు మాటలకు చలించడు.) కాదు బదరీ!

బద: (ఒత్తి పలుకుతూ) అంటువ్యాధనేనా?

సార: (మాట్లాడడు)

బద: (ఇంకా ఒత్తి పలుకుతూ) ఇంజక్షనిస్తా.

సార: ............

బద: ఇంకా కావలసిన సాధనాలన్నీ ప్రయోగిస్తా...పద...

సార: అయినా రాలేను బదరీ!

బద: చూడ్లేకా?...కష్టమౌనుకో...

సార: బదరీ ???

బదరీ: అవును కష్టమౌనుకో...రెండుమాటలు వినిపించు...ముఖం చూపించు ...చాలు...అంతే...ఆమెను బ్రతికించే పూచీనాది.

సార: (ముఖంలో అయిష్టం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది).

బదరీ: ఛీ! ఛీ! ఇంత నీచంగానా ప్రవర్తించటం...నేనూ నీవంటి మనిషిని కానూ? అంత భయంకరంగావుంటే నేనెలాచూస్తున్నా? ఆ వ్యాధి నన్నంటుకోలేదేం?

సార: బదరీ!...నువ్వు డాక్టరువి...నీ గుండె రాతితో సమానం...నీ కళ్లు ఎంత భీకరదృశ్యాన్నైనా చూడగలవ్.

బదరీ: చదువుకున్న వాళ్లలో ఇంత మూర్ఖులుంటారనుకోలేదు..

సార: డాక్టర్లు...చచ్చిన మనుషుల్ని కోస్తారు...బతికున్న మనుషుల్ని కూడా పొట్టలూ, మెదళ్లూ చీలుస్తారు లోపల ఏముందో చూట్టానికి. అటు వంటివాళ్ల గుండెలు గుండెలెలా అవుతాయి రాళ్లుకాక !

బదరీ: (ఆవేదనాస్వరంతో) కావాలని పెళ్లి చేసుకుని ఏడేళ్లు హాయిగా కాపరంచేసి, అందాన్ని కావలసినంతా అనుభవించి...ఇప్పుడు పిప్పిగదా అని పారెయ్యడం...

సార: (మెల్లిగా) లోకం ఈ మాటంటే ఇంత నొచ్చుకునే వాణ్ణికాదు.

బదరీ: నేనే అంటే ఆశ్చర్యంగా వుందా ?

సార: అభిమానంగా కూడా వుంది.

బదరీ: అయితే నే నన్న మాటలన్నీ వృథాగా పోలేదు...

సార: పోలేదు...లోపల ఓ మూల కుప్పగా పడి మూలుగుతున్నై.

బదరీ: సమయం కోసమా?

సార: మూలుగుతున్నది సమయం రాదని తెలిసే !

బదరీ: ఈ తత్త్వం కలవాళ్లు లోకంలో చాలామంది న్నారని తెలుసు... కానీ...నువ్వూ ఆజాతి వాడవని...

సార: ఆజాతివాళ్లకి మెదడు పని చెయ్యదనా నీ ఉద్దేశం?

బదరీ: చెయ్యకపోనూవచ్చు. వాళ్లకి హృదయం, మెదడూ, నీతీ ఎలా ఉంటాయి ?

సార: నా ఆవేదన గ్రహించలేని స్నేహితుడు...

బదరీ: ఉన్నా ఒకటే, లేకపోయినా ఒకటే సంటావ్ ?

సార: (మాట్లాడడు

బదరీ: కానీ...నే నున్నది నీ కోసం కాదు...నీ కోసం వుండే సమయం దాటిపోయింది...తండ్రివుండీ రాలేదు. తల్లిలేదు. అత్తగారు ఒచ్చినా కొడుకునే సమర్థించొచ్చు! ఇంక సరే భర్తవీ, భరించేవాడివి.. నీ స్థితి కనుపిస్తూనేవుంది...నేనూపోతే ఆ అనాథకు దిక్కెవరు?

సార: తండ్రి దరిద్రుడు.

బదరీ: అయితే?

సార: కారు ఛార్జీకి డబ్బు లేదేమో !

బదరీ: ముష్టెత్తుతాడు.

సార: అంతే చివరికి...

బదరీ: అయినా వస్తాడు.

సార: ముప్పేత్తింది తిండికిచాలద్దూ?

బదరీ: పరిస్థితి తిండిని జ్ఞప్తికి తెచ్చేదికాదు.

సార: దరిద్రుడికి తిండి తరవాతే అన్నినూ.

బదరీ: నీ పెళ్లయి ఏడేళ్ళుకదూ?

సార: ఊ...ఎందుకూ?

బదరీ: అయితే ఓ విషయం సత్యమైయ్యుండొచ్చు!

సార: ఏ విటదీ?

బదరీ: అప్పటి తాలూకు కట్నంగానీ, అలక పాన్పుమీదికోరికగానీ బాకీ ఉన్నాడా ఆయన?

సార: ఛీ ఛీ!

బదరీ: మరి? బీదవాడని బంధువుని దూషించడం అవివేకం!

సార: బదరీ!

బదరీ: కూతురిలావుందంటే కుమిలిపోడూ...రెక్కలు కట్టుకుని వాలడూ?... తిండికి లేనివాడు గదా అని కూతురిమీద అపేక్ష లేదంటావా?... అసలు ఉత్తరం రాశావా అని.

సార: ఆ మాత్రం నమ్మకంకూడాలేదా నా మీద?

బదరీ: వింటున్నమాటలు ఆ నమ్మకాన్ని కాస్తా రూపుమాపాయి.

సార: ......రాశాను...అవ్వాళే...(తల ప్రక్కకి తిప్పుకుంటాడు).

బదరీ: అయితే తప్పకుండా వస్తాడు.

సార: వస్తే ఆనందం ఎవరికి?

బద: రావాలనుకునే వాళ్లకి...

సార: అమ్మకూడా ఇంతవరకు రాలేదు.

బద: తీర్థయాత్రలకు వెళ్లినవాళ్లు రావటం మాటలా?

సార: తప్పకుండా వస్తుంది.

బద: అవును...(వ్యంగంగా) ఆప్తులను ఆపదలో చూడాలనుండటం సహజమేగా!.....ఛీ! స్వార్థం!

సార: బదరీ!

బద: మీ అమ్మని చూడాలని నీకెంత ఆతృతగావుందో అలాగే ఆమెకూ వాళ్లనాన్నని చూడాలని ఉండదూ?

సార: కలవరించటం లేదుగా!

బద: (ఆమె జ్ఞాపకం రాగానే మళ్లీ తన ధోరణిలో పడతాడు) ఆ కలవరించేది నీ కోసం!...కానీ... నువ్వో రాతి విగ్రహంగా మారావని ఆమెకు తెలీదు...తలుపు చప్పుడు కాగానే ఆతృతగా చూస్తుంది. నీ కోసం... కానీ...తీరా...ఆశాభంగమౌతుంది. నేను కనిపిస్తాను. ఆశగా నా ముఖంలోకి చూస్తుంది. ఛీ ఛీ! ఆమె దృష్టిలో నేను కలుషితుణ్ణయి... నీ కోసం...అబద్ధం ఆడడం తప్పటంలేదు. "వస్తాడు...ఇంకా రాలేదు. ...మీ నాన్నగారిని తీసుకురావటానికి వెళ్లాడు..." అంటూ. ఆమె కళ్లలో నీళ్లు తిరుగుతాయి.

సార: బదరీ!...ఏంచెయ్యను...అశక్తుణ్ణి!...నా ఆందోళన అర్థంచేసుకో... చెప్పలేను...

నిశ్శబ్దం.

......ఆ!...ఈ వ్యాధి ఒస్తే కళ్లుకూడా......పోయేందుకు...అవకాశం ఉందంటారు గదూ?

బద: ఏం?...గుడ్డివైతే నీ పాత్రనికూడా నమ్మి వహించి మోసం చెయ్యమంటావా?

సార: బదిరీ!

బద: అదేగా నీ ఉద్దేశం?

సార: (తల వొంచుకుంటాడు)

బ: సారథీ! అవమానానిక్కూడా హద్దుండాలి!...ఈ నాటింగోల్చింబి ఎన్నిసార్లు నీచంగా మాట్లాడావో ఆలోచించు...నీ ఆపద స్థితిలో నీ మాటలు లెక్క చెయ్యలేదు...ప్రేమ పవిత్రమైందని చెప్పే నువ్వేనా ఈ మాట్లాడేది?

సారథి: బదరీ!

తెరలో: (మూలుగు)

బదరీ : (గబగబా వెడతాడు)

సారథి: అవును...గుడ్డిదైతే...గుడ్డిదైతే...గుడ్డిదై బతికితే!
బతికితే... (గొణుగుతుంటాడు)

(తెరలో కారు హారన్. బ్రేక్ వేసిన శబ్దం)

డాక్టర్ లోకనాథం: (వచ్చాడు) హల్లో సారథి! (నలగని సూటు తొడిగిన వ్యక్తి. నిండుకుండలాంటివాడు చేతిలో బ్యాగ్)

సారథి: రా!...కూర్చో...

లోక: ఎలావుంది?

సారథి: ప్రాణసంకటంగా వుంది!

లోక: (తిరిగేకుర్చీలో కూర్చుంటూ...) ఎవరికి?

సారథి: ఇద్దరికీ...

లోక: ఆదేవిటి వాణ్ణిలా కట్టేశావ్?

సారథి: హింసించానా?

లోక: కాదూ?

సారథి: కాదేమోనని.

లోక: (వెరీ బేడ్) విప్పేయ్ విప్పేయ్ !

సారథి: విప్పేస్తే వాడూ దక్కడేమోనని...

లోక: సెంటిమెంటల్...ఆ! ఎలావుందామెకు?

సారథి: చెప్పానుగా!

లోక: అర్థం కాలా!

సారథి: కాదులే! మీరంతా పవిత్రులు ... నా బోటి సామాన్యమానవుడి ధోరణి అర్థం కాదు.

లోక : స్కాండలస్ !

సారథి: అదేంలేదు...నన్ను ఎవ్వరూ అర్థం చేసుకోలేరేమో అని ఆదుర్దా...

బదరీ : (వస్తూ) హలో లోకనాథం! పలవరింతలూ ఎక్కువయ్యాయి.

లోక : (ఏవో నోటుబుక్కు తిరగేస్తూ) కమింగ్, కమింగ్ ...

సారథి: బదరీ! ఏం కలవరిస్తోంది?

బదరీ : చెప్పి ఏం ప్రయోజనం?

సారథి: ఆమాత్రం తెలుసుకునేందుకైనా...

బదరీ : అధికారం వుందంటావా ?

సార : కాదు. బాధపడేందుకు.

బదరీ : ఎందుకూ? గుళ్ళో దేవుడిదగ్గర వాగినట్టే ... చలనంలేని పాషాణాలు...లోకం! క్విక్ !

లోక : యస్, యస్... (చూస్తూన్నాడు.)

సార : బదరీ!

బదరీ : (వినిపించుకోడు. లోకనాథం టేబిలుదగ్గర నిలబడతాడు)

సార : (దీనంగా చూస్తూంటాడు.)

బోయ్: (వచ్చాడు.)

బదరీ : కమాన్! అక్కడపెట్టు...(బుజ్జీవంక చూసి) నిద్రపోయాడు...

లోక : బోయ్, కాఫీ.

సార : (టేబిల్ మీద గ్లాసు బోయ్‌కిస్తాడు) తొరగా రా!

బోయ్: చాక్ లెట్లు, పిప్పర్ మెంట్లు బల్లమీద పెట్టి, ఫ్లాస్క్ తీసుకుని వెళ్లిపోతాడు.)

సార : (బదరీ ముఖంలోకి దీనంగా చూస్తాడు.)

బదరీ : (జాలేసి మెల్లిగా) సారధీ!

సార : (ప్రాధేయంగా) చెప్పు బదరీ! ఎలావుంది?

బదరీ : సారధీ! చెప్పి ఏం ప్రయోజనం? చెప్పిన వెంటనే 'వెళ్లూ' అనడం నాకు తప్పదు. నీకది పడదు ... ఎందుకు నన్ను బాధపెడతావ్?

సార : ... ... ... ...

బదరీ : మళ్ళీ మళ్ళీ చెప్పను ... ఆమె కలవరించేది నీ పేరే! పించి పోతోంది ... నీకోసం ... పిలిచి పిలిచి గొంతు ఎండిపోతుంది ... మంచినీళ్ళు గుటకెయ్యదు... విలవిలా తన్నుకుంటుంది ... 'ఏవండీ'! ఒక్కసారి ... కనిపించండి ... ఇదే నా ఆఖరుమనవి' అంటుంది. గుడ్లు తేలేస్తుంది. మూలుగుతుంది ... అబ్బా! సారధీ! చెప్పి ఏం ప్రయోజనం? ... ఆ యాతన చెపితే అర్థమయ్యేదికాదు.

సార : (కంటనీటితో) బదరీ!

లోక : డామిట్! ఏమిటీ సెంటిమెంట్?... అనవసరం...నోయూజ్!... ఆ! ఈ బాటిలు తెప్పించు బదరీ! నాకర్జంటు కేసొకటుంది ... మళ్ళీ ఓ గంటాగివస్తా ... గుడీవినింగ్! (వెళ్ళిపోతాడు)

సార : బదరీ!...

1వ తెరలో : (మూలుగు)

2వ తెరలో : (కారుస్టార్టయి వెళ్లిపోయిన శబ్దం.)

బదరీ : (లోపలికెడుతూ) ఆలోచించి...(వెళ్లాడు).

సార : శశీ!... శశీ!... ఎంతద్రోహం ... ద్రోహం...శశీ...

మామగారు (ప్రవేశిక) : (వచ్చాడు కట్టు కొందరాలేదు. చాలా పేదస్థితిని సూచించే చిక్కించిన దుస్తులు. దేవుళ్ళాడుతున్నట్టు, చేతులు జాపుకుని, కళ్ళతో వారి మామకంగా వచ్చాడు) అమ్మాయ్!... అమ్మాయ్!... ఎవరు బాబూ!... అమ్మాయేదీ ?

కాలేజి స్టూడెంటు : (గడ్డంతోయున్న) చెయ్యిపట్టుకుని తీసుకొచ్చాడు) ఏమండీ మీకేనా పార్థసారథిగారు? మామగారు అయినా జాలీ, గౌరవం లేవండీ? పాపం కళ్ళులేనివాడు ... తడుముకుంటున్నాడని తెలిసి కూడా కాస్తలా ఎన్ట్రాన్స్ దగ్గర కెళ్ళలేకపోయ్యారు? మంచి పెద్ద మనిషి తగాదేమండీ!... వెధ ప్రపంచం!... ఆc! ... అది సర్లేరు ... కూర్చోండి తాతగారు! ... (వెళ్ళబోతూ) పెద్దమను షులెటువంటి పని చేసినా చెల్లుతుంది లెండి......

సార : సారీ బ్రదర్ !

స్టూ : ఇంకా సారీ ఎందుకులెండి ... అయిపోయిందిగా ... బస్సుదిగి ఎటువెళ్ళాలో తెలీక కారుకిందపడేవారే! కొంచెంలో తప్పింది...

సార : థాంక్స్ చాలా థాంక్స్.

స్టూ : నో మెన్షన్ ! (వెళ్ళిపోతాడు.)

మామ : నాబిడ్డేదీ ? బాబూ,...నా బిడ్డేదీ? అమ్మా! అమ్మా ! ఎక్కడమ్మా! నీకెంతవస్తోచ్చింది తల్లీ ! (వస్తూ వస్తూ కుర్చీమీద పడతాడు. కుర్చీ తిరగబడుతుంది.)

సార : (దగ్గిరికు వెళ్ళబోతూంటాడు)

బదరీ : (గబగబావస్తూ) ఏమిటది? ఎవరూ ?

మామ: బాబూ! ఎవరో మీరు ... చూడండి ... ఈ ఇంటాయన సారథి లేడూ? ... ఆయనమామగారు ... కటికి దరిద్రుడని, నిర్భాగ్యుడని విన్నారు కాదూ?

బదరీ : అవునూ...

మామ: అవునా ? ... ఇప్పుడు చూడండి ... నేనే అనిర్భాగ్యుణ్ణి ... చూడండి ... చూడండి ... గొణుగుతూంటాడు.)

బదరీ : ఆఁ! మీరేనా ... (సారథి వంక తిరిగి) కళ్ళులేనివాడని కనుపించడంలా ... పడుతూంటే చూస్తూ నిల్చుంటావేఁ ? ఆమాత్రం జ్ఞానం లేదూ ? ... ఇంక పశువుకీ నీకూ తేడా ఎక్కడ ? (ముసలాయన్ని లేవదీశాడు)

మామ : బాబూ ! ఎవర్నో కూకలేస్తున్నారు ? చూడండి ... ముందు నా బిడ్డదగ్గిరికి నన్ను తీసుకెళ్ళండి. నాతల్లి దగ్గిరికి నన్ను తీసుకెళ్ళండి...బాబూ తీసుకెళ్ళండి... తల్లీ ! ఎక్కడమ్మా ! (కడుపు తరుక్కుపోతున్న బాధ. మాటలూ, మనిషీ ఒణుకుతున్నాడు).

తెరలో : (మూలుగు)

బదరీ : చూడండీ ... అలా ఖంగారు పడకూడదు. ముందు ఈ కుర్చీలో కూర్చోండి ... (కూర్చోపెడతాడు) మీఅమ్మాయికొచ్చిన అపాయమేమీ లేదు... కూర్చోండి.

మామ : నేనూ కూచోటానికేముందండి ! ... నాతల్లికి చల్లగావుంటే అట్టాగే కూర్చుంటా అప్పుడు హాయిగా కూర్చుంటా ... నాకు తల్లిదగ్గిరికి కెళ్ళాలనుంది ... తీసుకెళ్ళండి. బాబూ !

బదరీ : అబ్బా ! అలా హడావిడి చెయ్యకండి ... (టేబిల్ మీద సిద్ధంగా పెట్టివున్న ఇంజక్షన్ శిరెంజి తెచ్చి) ఉండండి ... కదలకండి... ఒక్కసారి ... ఆ ! ఆ ! అయిపోయింది (శిరెంజి టేబిలుమీద పెట్టేస్తాడు.)

మామ : నాకెందుకండీ ? నాకెందుకవన్నీ...కంచిగెంజలాంటి మునలిముండా కొడుకుని ... నాకెందుకు ? నా తల్లిని రక్షించండి బాబు !...దాని సంగతి చూడండి !

2 దకే : (ఆయన్ను లేపి తీసుకెళుతూ) ఆ! అలా మెల్లిగా పదండి...అలా వకండి ఒక్కరగా ... అమ్మాయి కంగారుపడుతుంది...తెలిసిందా?... ఆ! అలా...

(ఇద్దరూ లోపలికెళ్ళిపోతారు)

తెరలో మామ : తల్లీ...నా తల్లీ...

ఆమె : నాన్నా... నా...న్నా...(ఆయాసం)

మామ : (ఏడుపు) మా అమ్మే...నీ కెంత అవస్థొచ్చిందే ..

బదకీ : అలా ఏడవకూడదు ... చూడండి ... అబ్బ ... నామాటవినాలి ... ఊఁ...

మామ : (ఏడుపు మానలేదు.)

బదకీ : వీల్లేదు ... పదండి ...

ఆమె : (మూలుగు.)

బదకీ : మీ రిలా ఏడుస్తారని తెలుస్తే అసలు లోపలకు తీసుకొచ్చేవాణ్ణే కాదు ... అసలే సీరియస్ కేస్ ... ఊఁ ... పదండి బయటికి ... ఊఁ...

మామ : బాబూ ! ఉండనీండి ... నా తల్లిదగ్గరుండనీండి...(ఏడుస్తునే)

బదకీ : (ఏడుస్తున్న ముసలాయన్ను రెక్కపట్టుకుని తీసుకొచ్చి తలుపేస్తాడు) అబ్బా! అధికంగా ప్రేముండటంకూడా ప్రమాదమే !

సార : పోనీ కొంచెంసేపు ఉండనివ్వకపోయావా?

మామ: డాక్టరు గారు ! నన్నన్యాయం చేస్తున్నారు. నన్ను దానిదగ్గరే పడుండనియ్యండి...బాబూ ! (ఏడుస్తు తలుపుదగ్గరే కూలబడతాడు).

బదకీ : అబ్బే! మీరలా కిందకూర్చోకూడదు. లేవండి...

మామ: నాతల్లి బాబూ నాతల్లి...

బదకీ : నామాట వినండి తాతగారూ ! ... మీరు లేవండి.

మామ: నాకెందుకయ్యా కుర్చీలు? నాకొద్దు...నాకొద్దు. నాబిడ్డదగ్గర నన్ను దిగబెట్టండి ... ఊ! త్వరగా... డాక్టరు గారూ!

బదరీ: అదే స్మరణా? చెపుతుంటేనూ...

మామ: నాతల్లి...

బదరీ: అబ్బ! (తలపట్టుకుని) మీ అమ్మాయికొచ్చిన ప్రమాదమేమీ లేదు. మేంలేమూ?

మామ: మీరేం చెయ్యగల్రు? ... మందులు పొయ్యగల్రు గాని ... నా నాబాధ తీసెయ్యగల్రా?

బదరీ: మిమ్మల్ని కాదనలేదు తాతగారూ! కానీ మీ ఆందోళన కాస్త ఉపశమింపజేసుకోండి.

మామ: ఎలా బాబూ ఎలా? నాచేతుల్తో నాబిడ్డకి ఉపచారం చేసుకో నివ్వండి...నన్ను పంపించండి...నన్నుపచారం చెయ్యనీండి...

సార: పోనీ...బదరీ! ... వెళ్లనివ్వరాదూ?

బదరీ: సారథీ!. అంతేగాని నువ్వుమాత్రం రానంటావ్?

సార: మళ్లీ మొదటికొస్తున్నావ్ బదరీ!

బదరీ: అవును మొదటికే వస్తున్నాను. కానీ ... రాకతప్పదు ... వచ్చితీ రాలి ... లేకపోతే ... లేకపోతే ... లాక్కెడతా ...

సార: (ముఖంలో ఓర్పు నశించినట్లు మార్పువస్తుంది.) అసాధ్యం ... అయ న్నలా బాధించి...నన్నిలా బాధించి ... (నోరుజారి) ఎందుకిలా పగ తీర్చుకుంటావ్?

బదరీ: పగ !!! పగ! నాకేనాపగ? ... ఇదికాదు పగంటే ... సమ యానుకూలంగా వ్యక్తులు మారిపోయి, దగ్గరున్న వాళ్ళను హింసిం స్తారే ... అదిపగ! ఇతరులనుభవిస్తుంటే నవ్వి, తనదాకావస్తే తెల్ల

ముఖంవేసి, ఏంచెయ్యాలో తెలీక పశువుల్లా ప్రవర్తిస్తారే ... అది పగ! ... దరిద్రుడని ఆత్మబంధువుని నీచంగా చూస్తారే ... అది పగ! వీళ్లైనంత కాలం సుఖాన్ననుభవించి, దుఃఖం రాగానే ముఖం చాటేస్తారే ... అదీ పగ!

శార: (బిగ్గరగా) బదరీ!

శ్యామ: బాబూ! నాకోసం మీరలా యిడవకండి డాక్టరుగారూ! నా కూతుర్ని చూడనీండి ... బాబూ చూడనీండి ...

బదరీ: అవును మీరేచూసేది! మీరు చూస్తారుకదూ! దేనితో! దేనితో మీరుచూసేది! మీమతి పోయిందల్లేవుంది ... సాంధీ! తండ్రీనంటే అయ యకపు గుండె చూడు ... చూడు ... వాత్సల్యపు ... ఎలా చూస్తావ్? దేనితో? నువ్వు కళ్ళున్న అంధుడివి. కళ్ళులేని అంధుడు "కూతుర్ని చూడనివ్వండి" అంటాడు. ఎంత ఆశ! ... ఎంత ఆతృత! నువ్వో! ... ఛీ! ... ఈ ప్రపంచం యావత్తూ అంధకారమయమైపోయి ఆ గుడ్డి తండ్రికి కళ్లివ్వరాదూ దయామయుడైన దేవుడెవరైనా వుంటే ...!

శ్యామ: ఏవండీ! చూడండీ! ... ఎవరూ అది? ... డాక్టరుగారేకదూ? అలా అమ్మాయిదగ్గిరెవరూ లేకుండా ... అందరూ ఇక్కడే ... (ఏడుస్తూ) ఎంత దిక్కుమాలిన దానివైనావే తల్లి!...

తెరలో: (మూలుగు)

బదరీ: (వెడుతూండగా)

బోయ్: (వస్తూ) సార్! కాఫీ ఇదిగోండి.

బదరీ: అక్కడపెట్టు... (వెళ్లబోతూ మళ్లీవచ్చి) ఏదీ. ఇలాతే! (ఫ్లాస్కు తీసుకుని వెళ్లాడు. కాని వెంటనే మళ్లీవచ్చి, చీటీ ఇస్తూ) ఈ మందు తీసుకురా ... అర్జంట్ ... (వెళ్లాడు లోపలకు)

బోయ్: (వెళతాడు)

మామ: డాక్టరుగారూ ! నన్ను రానీండి బాబూ ! ... ఎక్కడబాబూ ? ఇదుగో ఎలావినండి....

సారథి: డాక్టర్ లేడిక్కడ. ఏవిటో చెప్పండి.

మామ: ఉన్నావా నాయనా సారథీ ! ఇక్కడే వున్నావా !... అమ్మాయిని నువ్వసలు చూళ్లేదా బాబూ ?

సార : ... ... ... ...

మామ: అబ్బాయ్ !... ఇదిగో ... ఎంత ఇదిగా ఉండే సంసారం !... ఎలా అయింది... చూడు నాయనా సారథీ... దాని దగ్గరుండేందుకు నన్ను పంపించరాదూ ! ... ఉపచారం చేస్తాబాబూ !... నువ్వే నా డాక్టరు గారికి చెప్పు నాయనా! నా ప్రాణం ధారపోసైనా అమ్మాయిని బ్రతికిస్తా... నాకీ ప్రపంచంలో ఇంకెవరున్నారు బాబూ ! ... దాన్ని బ్రతికించి నీ చేతుల్లో పెట్టిపోతా...

సార : ... ... ... ...

మామ: నాయనా !...కుర్రాడేడీ కుర్రాడు ?... బుజ్జిగాడు? ...

బుజ్జి : (నిద్రలోనే మెల్లిగా 'అమ్మా' ! అంటాడు.)

మామ : నాయనా ! ఇక్కడేవున్నావా ?

సార : ఉన్నానున్నాను.

మామ : చూడూ అమ్మాయేదో అంటున్నది ... విన్నావూ ? హయ్యో నన్ను తగలెయ్యా ! నేనెందుకు నాశనం కాకపోతిని ... అమ్మా ! అమ్మా ! ఏవిటమ్మా !

సార : (ఇక ఓర్చుకోలేనట్టు ... ) బదిరీ ! బదిరీ ! (మెల్లిగా)

బదిరీ : (తలుపుతీసి తల బైటికి పెట్టి) ఏమిటి ?

సార : ఈయన్ని లోపలకి తీసుకెళ్లు.

బదరీ : (ఇవతలకొచ్చి తలుపేసి) ఎందుకూ ?

సార : ముందు తీసుకెళ్ళు చెపుతా.

బదరీ : వీల్లేదు.

సార : వీల్లేదా ?

బదరీ : అవును.

సార : అదేం ?

బదరీ : అదంతే !

మామ : అదేవిఁటండీ...బాబూ నన్నెందుకిలా ఏడిపిస్తారు పోనీండి...

బదరీ : మీరిలా అనవసరంగా ఖంగారుపడుతూ, గోల చేస్తూంటే పంపించడ మెలా ?

మామ : నాయనా ! నా ఆవేదన నీకేం తెలుస్తుంది ?... అమ్మా ! దుఃఖంగా) అమ్మాయ్ !

బదరీ : అదిగో ... ఏవండోయ్ ... మీ కిదే చెప్పటం, మీరిలా ఏడుస్తే ఏంలాభంలేదు...

సార : బదరీ ! ఏవిఁటి నీ ఉద్దేశం ?

బదరీ : ఆఁ ?

సార : నేను రాలేనని మొత్తుకుంటే, నాబాధ గ్రహించకుండా 'రారా' అని చంపేస్తున్నావ్ ! ఆయన లోపలి కెళ్ళాలని గోలచేస్తూంటే పంపించవేఁ ?

బదరీ : అది అంతే ! ... వస్తే నువ్వురా...

సార : ... ... ... ...

బదరీ : రావ్ ! ... నువ్వెందుకొస్తావ్ ? ... ఆ ప్రాణం ఎప్పుడు ఎగురు తుందా అనీ మళ్లీ హాయిగా ఏ డబ్బున్న మామగారినో సంపాదిం చచ్చనీ చూస్తున్నావ్ ?

మామ : బాబూ !

సార : బదరీ ! ... బదరీ ! ఏమన్నావ్ బదరీ ! ... మళ్లీ పెళ్లా ? ... ఏమన్నావ్ ?...(గోడనున్న భార్య ఫోటోవంక చూస్తూ, మెల్లిగా దగ్గిరకెడుతున్నాడు) బదరీ ! నీకు నా ఆవేదన కొంచెంకూడా అర్థం కాలేదన్నమాట ! ... బదరీ !... నాశశి ... నాశశిని పోగొట్టుకుని ఇంకా ఈ ప్రపంచంలో...మళ్ళీ...మళ్ళీ ... పెళ్ళా ? ? (దుఃఖం పొంగి పోతోంది...)బదరీ!...ఏమన్నావ్!...(గబగబా ఊయలదగ్గిర కొచ్చి, బుజ్జిని కట్లోంచదీసికావిలించుకుని బుజ్జీ ... నా బుజ్జీ ! (ఏడుస్తున్నాడు)

బదరీ : (చూస్తూంటే తన కళ్లల్లో కూడా నీళ్లు తిరగటంవల్ల గిరుక్కున తిరిగి లోపలికెళ్లి పోయాడు.)

మామ : (ఏడుస్తున్నాడు...) అమ్మాయ్ !

బుజ్జి : (మెలుకువవొచ్చి) అమ్మా ! అమ్మా ! (కళ్లు నులుపుకుంటూంటాడు).

మామ : నాన్నా బుజ్జిలూ !

బుజ్జి : తాతయ్యొచ్చాడు...తాతయ్యా !... అమ్మదగ్గిరకెడదాం పదా !

సార : వెడదాం బుజ్జీ వెడదాం !... అమ్మదగ్గిరకే...... వెడదాం ......

బుజ్జి : పదనాన్నా ! పదవూ (తండ్రి బుగ్గలు చిట్టిచేతుల్తో రాస్తూ) మానాన్నా మంచి నాన్నా...

సార : బుజ్జీ (గట్టిగా కావిలించుకుంటాడు.)

శేషమ్మగారు (సారధి తల్లి) : ఒచ్చింది. స్ఫోటకం మచ్చలతో, అసహ్యంగా వున్న ముఖం. వయసు మళ్లిన విధవ. నకేసి) అబ్బీ !

సార : అమ్మా ! (ఎదురుగా వెళ్లి కావిలించుకుంటాడు.)

బుజ్జి : మామ్మా ! మామ్మా ! తాతయ్యొచ్చాడు...

సార : అమ్మా ! (ఏడుస్తూ) నా ఇల్లు కూలిపోతోందే ... అమ్మా ! శశి అన్యాయం చేస్తోందే

శేష: ఎలావుందేవిటి? ఏవిటూ! ... ఉండు ... ఊరుకో నాయనా... ఊరుకో... (బిడ్డని ఎత్తుకుంటుంది.)

తార: అమ్మా!

శేష: ఏదీ ... నన్ను చూడనీండి ...

బదరి: (వచ్చి) ఉండండుండండి. కొంచెం ఉండండి. (ఇంజక్షన్ సిరెంజి తెచ్చి) చూడండి ... ఇదీ ... (దగ్గిరికి వస్తూంటాడు.)

శేష: ఎందుకూ? ఎందుకండీ ఈ సూది పోట్లు?

బదరి: ఈ వ్యాధి అంటువ్యాధి!... ఈ ఇంజక్షనూ ...

శేష: అక్కర్లేదు ... ఇది అమ్మవారు. మందులేమీ వెయ్యకూడదు. తెలిసిందా? ... కనుపించటంలా ... నా ముఖాన్ని చూడండి ... సరే ముందు మీరు తప్పుకోండి ఈ మందులు మాకేం అక్కర్లేదు... ఈ సూది పోట్లూ ఆపీ వచ్చాకే రోగాలకి అంతూ పంతూ లేకుండా పోయింది.

మామ: శేషమ్మగారూ! ... నాతల్లే ... నాతల్లే ... చూడమ్మా నాబిడ్డని చూపించు...

శేష: వస్తారా బాబూ! పదండి ... పదండి ... అందరూ పదండి ... అమ్మాయీ గదిలోనే వుందిగా! పదండి ... (కొడుకుని) రా రా నాయనా! రా! నేను ఈ అమ్మవారి వ్యాధుల్లో మునిగితేలాను. రండి!

బదరి: ఆగండి! ఎందుకలా అందరూ వెడతారు? వీల్లేదు.

శేష: ఏం?

బదరి: వీల్లేదు. పేషంటు ఖంగారు పడుతుంది. అసలే ...

శేష: ఏం ఖంగారు పడదు. మేం లేమూ! (వెడుతూంటుంది)

బదరి: (గుమ్మాని కడ్డంగా నిలబడి) ఏమైనా సరే వీల్లేదు.

శేష : ఏమండోయ్ ! మీ వైద్యం అక్కర్లేదని చెప్పలా ?

బదరీ : చెప్పినా సరే !

శేష : వెళ్లనీవయ్యా పిచ్చి తండ్రి

బదర్రీ : నామాట వినాలి... నేనా అమ్మాయికి వైద్యం చేస్తున్నాను నాలుం రోజుల్నుంచీ... మీరిప్పుడొచ్చి ఇలా నాపనికి ఆటంకం కలిగించటం మంచిపనికాదు... కావలిస్తే మీ రొక్కరూ వెళ్లండి. అప్పైనా ఇంజక్షన్ చేయించుకుంటేనే...

శేష : ఏవిటీ అధికారం ? మేం వెడతాం ... మీరెవరు అడ్డం చెప్పటానికి ?... మా పిల్లకి మాయిష్టంవచ్చిన వైద్యం చేయించుకుంటాం ... అదంతా మీకెందుకండీ ?

తెరలో : (మూలుగు)

శేష : రారా నాయనా...రావేం? అలా నిలబడిపోయావేం రా !

బదరీ : అతనొస్తే ఇక కావలసిందేముంది ?

శేష : ఎందుకు రాడు ?

బదరీ : భయం !...

శేష : భయం ? ... ఎందుకు ?

బదరీ : అంతేలెండి !

శేష : ఓరి పిచ్చి అబ్బిగా !... రారా నాయనా !

మామ: పద నాయనా మే మెంతమంది మీ కంటబడితే మాత్రం ఏముంది ? అసలువాడివి నువ్వే లేండే ! రా నాయనా !

శేష : రారా !

సార : అమ్మా ! మీరెళ్లండి... నేను రాలేను...

బుజ్జీ : పద మామ్మా మనం వెడదాం...నాన్న రాడులే, ఎప్పుడూ అంతే !

బదరీ : ఏమైనాసరే అందరూ ఒక్కసారిగా వెళ్ళటానికి వీల్లేదు.

శేష : ఎందుకంటే అలా మందులు, మందులని ప్రాణసంకటం చేస్తారు. ఈఅమ్మ వారు మా ఇలవేల్పు...మా ఇంటినీ, వంశాన్నీ అంటిపెట్టుకుని, పారంపర్యంగా వస్తోంది ... చూడండి ... నేను అమ్మవారు దయకి గురి అయ్యాను... అప్పుడు వీళ్ళ నాన్న నా మంచం వదిలి పెట్టేవారే కారు ... వీడు పసివెధవ!... వాడికిదేం తెలుసు ?... మా ఇలవేల్పు చల్లని తల్లి...మా అత్తగారూ అంతే ! మా మామ గారు సేవచేసి బతికించుకోలా ? మా ఇంటి కోడళ్లకి ఇది "కానవాయితీ", వాడికి తెలీక గానీ... కుఱ్ఱసన్యాసి ... ఇలవేల్పంటే మాటలా?... దానికి శాంతి ... అదీ ... చాలా వుందిగా !

బసరీ : అయితే ఏమంటారు ? ... నేను వైద్యంచేసే రోగికి ఏ ప్రమాద మొచ్చినా నా ప్రాక్టీస్‌కి దెబ్బ !

శేష : అందుకని అమ్మవారికి ముందు లేస్తావుటయ్యా ?

బసరీ : నామాట వినండీ ... (పారిపోయేపడుతూ) వెళ్లకండి.

శేష : అలా పట్టుపట్టకండి ... వెళ్ళకపోతే ఎలా ?

తెరలో : (మూలుగు)

శేష : సరే, ఇక ఒక్క నిమిషం కూడా ఆగేదిలేదు ... రండి బాబూ !
(ముసలాయన్ని చెయ్యిపట్టుకుని తీసుకెళ్లిపోతుంది. తెరలో ఏడుపు, అవీ ప్రారంభమౌతాయి.)

బసరీ : (చిరాకుగా పచార్లు చేస్తూంటాడు)

సార : (దీర్ఘాలోచనో, విచారమో తెలీకుండా పైకిచూస్తూ కూర్చున్నాడు)

తెరలో శేషమ్మ : అమ్మాయ్ ! ఇటుచూడూ ! ఇదుగో నీబిడ్డ...)
ఇదుగో మీనాన్న... చూడమ్మా పాపం ... నీకోసం దేవుళ్ళాడు కుంటూ ఎలా వచ్చాడో ?

తెరలో ఆమె : బు ... జీ ... (మూలుగు)

శేష: ఎందుకమ్మా! ఇంకేం కావాలి నీకు? ... అజ్జా అలా అధైర్య పడకు... చూడమ్మా ... ఈ అమ్మవారు మన ఇలవేల్పు ... నీకెప్పుడూ చెప్తుతూండేదాన్ని కాదూ దీన్ని గురించి!... నేనున్నాగా ... ఇప్పుడే కావలసినవన్నీ ఏర్పాటు చేస్తా ... కూర్చోండి ... మీ రలా కూర్చోండి బాబుగారూ! ... నేనిప్పుడేవస్తా. (బుజ్జి నెత్తుకుని వచ్చింది.) అబ్బిగా! ... మామా వెంకటలక్షుమ్మగారికి కబురు పంపావ్రా?

సార: (లేదన్నట్టు తలూపుతాడు.)

శేష: లేదూ? ... అదేవిట్రా ... ఊళ్ళో పెద్దముండే... ఆమెకొక్కమాస్త నోటికబురైనా పంపకుండానూ ... సరేలే నే వెళ్ళొస్తా... ఇదుగో అబ్బిగా ... ఎందుకూ భయం? ... వెళ్ళు దానిదగ్గిరికి. చక్కగా మాట్లాడుతోంది ... వెళ్ళు నాయన. లేకపోతే దిగులుపడుతుంది ... (వెడుతూ) చూడండీ డాక్టరుగారూ! ... మీ రేమీ మందులూ అవీ వేయకండి ... అబ్బిగా! ఈయన్నిక వెళ్ళమని చెప్పూ (వెళ్ళిపోతుంది)

బదరీ: హు! (ఉరుముతాడు చేసేదిలేక)

సార: (పైకి చూస్తూంటాడు)

బదరీ: (గబగబా అటూ ఇటూ తిరిగి తలుపుదగ్గిరికి వెళ్ళబోతూంటాడు.)

బోయ్: (వచ్చాడు) సర్! మందు బాటిలిదుగో ... మరండీ ... అమ్మగారండీ ... నూతిదగ్గిరండీ ... నీళ్ళు పట్టుకొస్తున్నారండీ ... అప్పుడండీ ... బిందెజారి ...

బదరీ: (లోపలికెళ్ళాడు)

బోయ్: (తెల్లముఖం వేశాడు)

1వ తెరలో బదరీ: రండీ, మీరుండటానికి వీల్లేదు.

2వ తెరలో : (కారు హారనూ, బ్రేకు వేసినశబ్దం)
1వ తెరలో మామ : బాబూ డాక్టరుగారూ ! నన్నుండనీండి ...
బదరీ : వీల్లేదు.
(లోపలగది తలుపుతీస్కుని, మామగారిని తీసుకుని బదరీ, వీధివైపు తలుపు తీసుకుని లోకనాథం వస్తారు.)
మామ : నన్నుపోనీండి ... శేషమ్మ తల్లీ ; ఎక్కడికెళ్ళావమ్మా ?
లోక : ఎవరూ ? (తనకుర్చీలో కూర్చున్నాడు.)
సార : బదరీ ! ఏవిఁటిదంతా ... పోనిరాదూ ?
బోయ్ : సార్ ! అమ్మగారు ... అమ్మగారి కాలిమీదండీ ... నీళ్లబిందె పడి, వేలు చితికిందండీ ... మిమ్మల్ని వెంటనే రమ్మన్నారండి.
బదరీ : ఒక వేలేనా చితికింది ? (ఆవేదనగా) ఇక్కడ ప్రాణాలు చితికిపోతున్నాయి ! మానవత్వాలు చితికిపోతున్నాయి ! కష్టార్జితాలు చితికిపోతున్నాయి ! ... ప్రేమా, నీతీ, త్యాగం, బాంధవ్యం—అన్నీ చితికిపోతున్నాయి !!! కళ్ళు తెరిపిలుపడని చీకట్లో, అందం నశించిన అంధకారంలో కుడితిలో ఈగల్లాగా కొట్టుమిట్టాడుతుంటే— ఒక్క వేలేనా చితికింది ?...ఒక్క వేలేనా చితికింది వెళ్ళు...వెళ్లి ఇప్పుడు రావటానికి వీల్లేదని చెప్పు ... వెళ్ళు.
లోక : వెరీ బ్యాడ్ !
బోయ్ : (వెళ్లబోతూంటాడు.)
లోక : బోయ్ ! కాఫీ !
సార : బదరీ ! ఒకసారి ఇంటికి వెళ్లిరారాదూ ?
బదరీ : (సారథికి సమాధానం చెప్పకుండా, లోకనాథంతో) కాఫీవుంది లోకం ! (లోపలికెళ్లాడు.)
బోయ్ : (వెళ్లిపోయాడు తెల్లముఖంవేసి)

మామ: అంతా అయోమయం ... ఎవరు మాట్లాడుతున్నారో, ఎవరితో మాట్లాడుతున్నారో... ఏవిటో అంతా అయోమయం!...ఎందుకూ ఈ వెధవబతుకు! ... ఛీ ఛీ! (తల చేతుల్లో పట్టుకుని దుఃఖాన్ని మింగుతూంటాడు.)

సార : (లోకం టేబిలు దగ్గిరికెళ్ళి మెల్లిగా) లోకం! చూడూ! ...నాకిక శాంతి లేదా?

లోక: ఆc?

సార: ఈ వాతావరణం చాలా బాధగా వుంది లోకం!

లోక: ఊఁ...

సార: చూడూ...(అనుమానంగా మామగారివంక చూస్తాడు)

లోక: ఏవిటి సారధి ఏవిటి?

తెరలో: (మూలుగు.)

లోక: తాతగారూ! అమ్మాయిదగ్గిరికెళ్ళండి.

మామ: మా బాబే, మాబాబే ... (ముక్కుతూ, ఏడుస్తూ, తడుముకుని, తలుపుతీసుకుని లోపలికెళ్ళాడు).

తెరలో బదరీ: మళ్ళీ ఎందుకొచ్చారు? మొదలైన ప్రశ్నలూ, మూలుగూ, ముసలాయన ఏడుపూ మొదలైనవి జరుగుతూంటాయి. చివరకు ముసలాయన ఏడుపు కాస్త తగ్గిస్తాడు.)

సార: నేనిలా బతకలేను లోకం...ఈ ఆవేదనతో గుండె బద్దలవుతోంది.

లోక: డోంట్ వరీ ... మేమంతా నీకోసమేకదూ యీ అవస్థంతా పడుతూంటా...

సార: కాదు లోకం...

లోక: చూడు ... పాపం బదరీ ఎంత యాతన పడుతున్నాడో!

సార: అదికాదు లోకం ... నాకిందువల్ల శాంతి లేదు.

లోక: నీఉద్దేశం ?

సార: ఇక నా పంచ ప్రాణాలూ బుజ్జీమీదే! లోకం! శశిని ప్రేమించలేను.

లోక: అంటే ?

సార: అంటే ఏం చెప్పను లోకం! భీకరంగా వుండే ఆముఖాన్ని చూడ లేను ... చూడలేను శశిని ప్రేమించలేను ... లోకం ... నువ్వు డాక్టర్‌వి ... చూడూ ... నాకూ, నాశశికీ ... ఇద్దరికీ ఈ బాధ లేకుండా ... ఎవర్నో ఒకర్ని యీ ప్రపంచంలోంచి పంపించెయ్య ...శాశ్వతంగా...మళ్ళీ యిద్దరం కలుసుకోకుండా చెయ్యి ... అలా చెయ్యి లోకం...అలా...(చేతుల్తో ముఖాన్ని కప్పుకుని ఏడుస్తాడు).

లోక: సారథీ! అర్థమైంది...నాకూ అర్థమైంది.

సార: ఇదిగో ... చూడూ ... మన స్నేహానికి ... ఈ మాత్రం విశ్వాసం చూపించు...మిత్రఋణం తీర్చుకోలేను లోకం!...మరి మరి...మరేమీ లేదు (మళ్లీ ఏడుస్తాడు.)

లోక: ఇష్...

బదరీ: (మామగారితో వస్తాడు, కాఫీ ఫ్లాస్కు లోకనాథం టేబిలుమీద పెడతాడు.)

మామ: (తలుపుప్రక్కనే కూర్చుంటాడు.)

బదరీ: (గ్లాసులో కాఫీ పోస్తూ) సారథీ!

సార: ఆ?

బదరీ: మీ అమ్మగార్ని కాస్త సమాధానపరచలేవూ ?

సార: ఏమని ?

బదరీ: అదే! ... ఆ ఆచారాల్తో నా ట్రీట్‌మెంటుకి ఏమీ ఇబ్బంది రాకుండా...

సార: వాటివల్ల ఇబ్బందేమీ లేదుగా బదరీ !

బదరీ: (కాఫీగ్లాసు ఒకటి లోకనాథానికిచ్చి, మరొకటి తాను తీసుకున్నాడు) ఏలా?... ఆవిడవల్ల చాలా ఇబ్బందిగానే వుంది...

సార: (ఫ్లాస్కు మూతలో కాఫీపోసుకుని తాగుతున్నాడు)

లోక: లెట్ ఇట్ బి! బదరీ!... నీకేం? నీ ట్రీట్‌మెంటు కంటిన్యూ చెయ్యి... ఆవిడొచ్చినప్పుడు... తప్పుకో అంతే!

సార: అవును బదరీ! ఆవిడ కాస్త తొందర మనిషి... నువ్వేమీ ఫీలవకు.

తెర: (మూలుగు.)

మామ: బాబూ! నే వెళ్ళనా?... అమ్మాయి మూలుగుతోంది, (లేవబోతాడు.)

బదరీ: అహహాఁ! ఆగండి... నేవెడతా. (కాఫీ గబగబా తాగుతూంటాడు)

లోకం: నో, నో! కాఫీతాగు ... నేనున్నాగా! (బ్యాగ్ తీసుకుని లోపలికెళ్ళాడు.)

బదరీ: సారథీ! ఇదే ఆఖరుసారి... అసలు వ్యాధి ఎటువంటిదైనా, మనోవ్యాధివుంటే ... ఏ మందులువేసీ, ఏమీ ప్రయోజనం ఉండదు ... మందులు శరీరాన్ని బాగుచేస్తాయి గానీ ... మనస్సుని కట్టుదిట్టంలోకి తీసుకురాలేవు. వైద్యశాస్త్రం ఇంకా అంతమట్టుకు వెళ్ళలేదు. ఆమె కళ్ళకెదురుగా నువ్వు కూర్చోకపోతే...ఆమె నీకు దక్కదు. ఇది మాత్రంఖాయం!... ఇక నువ్వు రాకపోతే ... ఆసంగతైనా ఆమెకు చెప్పేస్తాను.

సార: దానివల్ల ప్రయోజనం ఏమిటి?

బదరీ: ఆఖరు క్షణాల్లోనైనా నిజం తెలుసుకుంటుంది. ప్రపంచంలో ఎంతటి విశ్వాసఘాతకులుంటారో తెలుసుకుని నిజాన్ని గ్రహిస్తుంది ... అంతే ప్రయోజనం. (కాఫీగ్లాసు బల్లమీద పెట్టాడు)

సార: ఇదివరకు నువ్వు శశిని చూశావు కదూ?

బదరీ: ఆ!

సార: ఎలా వుంటుంది ?

బదరీ: నీ భార్యలావుంటుంది ?

సార: అది కాదు.

బదరీ: ఊఁ ?

సార: మనిషి ?

బదరీ: అందంగా ...

సార: అవునా ?

బదరీ: అవును.

సార: నేనెలా ప్రేమించాను ?

బదరీ: మామూలుగా.

సార: అంటే ?

బదరీ: ఆ విషయం ఇప్పుడెందుకు ?

సార: మ ... ఇప్పుడెలావుంది ?

బదరీ: చెప్పనా ?

సార: చెప్పూ.

బదరీ: మీ అమ్మగారిలావుంది.

సార: పోలికెందుకు ?

బదరీ: కావాలి, మీ అమ్మంటే నీకు ప్రేమా, భక్తి వున్నాయా ?

సార: ఉన్నాయి.

బదరీ: ఎందుకని ?

సార: అమ్మ కాబట్టి.

బదరీ: నీ భార్యంటే నీకు ప్రేమేనా ?

సార: ఆ!

బదరీ : ఎందుచేత ?

సార : భార్య కాబట్టి! అందంగా వుంటుంది కాబట్టి ...

బదరీ : మీ అమ్మ నీ జీవితాంతం వరకూ వుంటుందా ?

సార : ఏమో !

బదరీ : నీ భార్య ?

సార : ఏమో !

బదరీ : కాదు. ఉంటుంది. ఎందుకంటే వయస్సులో చిన్నది కాబట్టి ...

సార : అయితే ?

బదరీ : అయితే మీ అమ్మ మశూచికం పడింది కదూ ?

సార : ఊ...

బదరీ : అయినా ఆమె అంటే నీ ప్రేమా, భక్తి ఏమీ తగ్గలేదుగా ?

సార : లేదు.

బదరీ : అలాగే నీ భార్య ...

సార : కాదు.

బదరీ : ఎందుకు కాదు ?

సార : మా అమ్మ అందంతో నాకు పనిలేదు.

బదరీ : సరే ... అందంతో పనిలేదు ... హృదయం కావాలి. అవునా ?

సార : అవును.

బదరి : అలాగే నీ భార్య... ఆమె అందంతో పనిలేదు. ఆమె హృదయం, దాని పవిత్రతా కావాలి...

సారథి : కాదు ... అందం కావాలి.

బదరీ : ఇంకా ...

సార : ఇంకేమిటి ?

బదరీ : మరి ప్రేమించానన్నావ్ ?

సార : అవును.

బదరీ : నువ్వు మూర్ఖుడివి... ప్రేమ అంటే ఏమిటో నీకు తెలీదు ... ప్రేమిం చేకి, ప్రేమించాల్సింది శరీరాన్ని కాదు ... హృదయాన్ని !

లోక: (మెల్లిగా వస్తున్నాడు.)

బదరీ : లోకం ! ప్రేమించాల్సింది హృదయాన్నా ? శరీరాన్నా ?

లోక : సాధారణంగా ... శరీరాన్నే !

మామ: కాదుబాబూ ! హృదయాన్ని ! శరీరం అశాశ్వతం ... హృదయం అనంతం ... అనాద్యం...దానికి చావు పుట్టుకలులేవు.

బదరీ : కాదు కాదు !... ప్రేమకి పుట్టుకుంది ... కానీ చావులేదు. ఇది నాసిద్ధాంతం.

మామ : కాదు బాబూ ! ... అదెలాగా ! ... పుట్టుక ఎప్పుడైతే వుందో చావు అప్పుడే వుండి తీరుతుంది ... చూడండీ ... మీరూ ఒక నాటికి నాస్తికతకి అంటే ముసలితనానికి రావల్సిందే ! నేనింకెంతకాలం భూమ్మీద వుంటాను ? ... ఎప్పుడో పోక తప్పదు ... మనందరం పుట్టాం — పోతాం ... చెట్లూ, జంతువులూ, పక్షులు, క్రిములూ, ప్రతి ప్రాణి పుడుతోంది. చస్తోంది. ప్రపంచంలో పుట్టినది ఏదీ చావ కుండా వుండదు ... అంటే ప్రేమకీ పుట్టుక లేదన్నమాటే బాబూ ! అంచేత చావూ లేదు. అది అతీతమైన ఓ శక్తి.

తెర : (పెద్దమూలుగుతో, చిన్న కేకలు) ఏవండీ ! ... ఏవండీ !!!

బదరీ : గబగబా వెడతాడు.)

లోక: (సారథి దగ్గిరగావచ్చి, అతని వెన్నుమీద చరిచి వస్తా ! ... (తలవంచుకుని వెళ్ళాడు)

సార : (ఆవేదన ఎక్కువౌతుంది ... బాధగా తల చేతుల్లో పెట్టుకుని, మోచేతులు టేబిలు మీద ఆన్చి కూర్చుంటాడు. చెమటలు కారి పోతూంటాయి.

మామ : అమ్మాయ్ ...

తెరలో ఆమె : (ఆయాసంగా...) ఒక్కసారి...వారిని...

బదరీ : పిలుస్తా...(వస్తూ) సారథీ! ఒక్కసారి రారా బ్రదర్! ... ఇక దైవానుగ్రహం ఉంటే...

మామ : ఏమన్నారూ! బాబూ ఏమన్నారూ ... దైవానుగ్రహమా ? ... తప్పకుండా వుంటుంది నాయనా! నాతల్లి ఎవరికి ఏం ద్రోహం చేసిందని దైవానుగ్రహం ఉండదు ? ... ఉంటుంది...

బదరీ : రా సారథీ!

సార : ............

మామ : వెళ్లు నాయనా!

బదరీ : సారథీ! (బిగ్గరగా) సారథీ!

తెరలో : (నావు కేక) ఏమండీ ... ఏ ... మం ... డీ!!??

బదరీ, మామ : లోపలికి పరుగెత్తుతారు.)

సార : (పరుగెత్తినట్టు పచార్లు చేస్తూంటాడు.)

తెరలో మామ : (గొల్లుమంటాడు.)

సార : (బిగ్గరగా) శశీ! (కేకేసి భోరున ఏడుస్తాడు.) కొన్ని నిముషాలపాటు నిశ్శబ్దం)

బదరీ : (తలవొంచుకొని, మెల్లిగా అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చాడు.)

సార : బదరీ (అరుస్తూ, ఏడుస్తూ బదరీని కావిలించుకుంటాడు)

బదరీ : (మెల్లిగా విడిపించుకొని కన్నీటితో) ఆఖరికి...నువ్వే గెలిచావ్!... గెలిచావ్ సారథీ గెలిచావ్! గెలిచి నువ్వేం సాధిస్తావ్ ? ... సాధించు ... మహా పురుషుడివయ్యావా ? ... విరాగివయ్యావా ? ప్రపంచానికి ఆదర్శపాత్రుడివయ్యావా ? ఏం నేర్చుకోవాలి నిన్ను చూచి యీ ప్రపంచం ?... పైపై అందాలకు మోహపడేవాళ్లున్నా ఇంత రాతిగుండెతో వుండలేదు ఎవరూనూ.

సార : (కుర్చీలో కూర్చుని టేబిలుమీద పడి ఏడుస్తున్నాడు.)

బదరీ : ఇంత కటిక గుండెవాడివి, ఇంత విశ్వాస రహితుడివి నాస్నేహితుడివి అయినందుకు ... నేను ప్రాయశ్చిత్తం ఏంచేసుకోవాలో తెలీడంలేదు పెళ్లి చేసుకున్న తరవాతే ప్రేమించటం నేర్చుకునే భార్యలే తమభర్తల్ని దేవుళ్ళుగా పూజించి, ఆఖరు క్షణంలో ఆరాట పడతారు ... ప్రేమించి ఏ త్యాగానికైనా సరే సిద్ధపడదామనుకున్న ఈమె ... ఈపవిత్రరాలు ఇలా దుర్మరణం పాలుకావటం ... ప్రపంచంలో జరిగే ఘోరాల్లో ఒకటి ... ముఖ్యమైంది.

అనురాగం, త్యాగం, దయా, జాలీ, వాత్సల్యం, ఆఖరుకి కుక్క చూపించే విశ్వాసాన్ని కూడా చూపలేని నీవంటివాళ్ళుండ బట్టే— భారత స్త్రీకి పుస్తెలూ, పిల్లలూ, వంటిల్లూ, ముఠుగూ, చాకిరి, శ్రాద్ధాలూ, వ్రతాలూ, భర్తే దైవం, తన్నేకాల్ని నాకటం... ఇలాంటి దుస్థితి పట్టింది ...

శేష : (బుజ్జినెత్తుకుని వస్తూ, లోపల్నుంచి వినిపించే ఏడుపువిని యింకా త్వరగా వెడుతూ) ఏం జరిగిందిరా నాయనా ఏంజరిగిందీ ? (లోపల ఏడుపులు)

# కీలు బొమ్మలు



ర చ న

సురమౌళి, చిన వెంకటరెడ్డి.

# పాత్రలు.



| | | |
|---|---|---|
| ౧. | లింగయ్య. | గ్రామ పంచాయితి మెంబరు. సామాన్య కుటుంబీకుడు. |
| ౨. | మంగమ్మ. | లింగయ్య భార్య. |
| ౩. | రామారావు. | ఆవూరి పెద్ద. పంచాయితి అధ్యక్షుడు. |
| ౪. | కాటమయ్య. | లింగయ్య బంధువు. యువకుడు. |
| ౫. | రంగయ్య. | ఆ వూరి పురోహితుడు. |
| ౬. | పంతులు. | ప్రాంతిక వైద్య మేధావి. ఖ్యాతిగల ఒక పంతులు. |
| ౭. | కాశీం. | పంచాయితి మెంబరు. |
| ౮. | చంద్రయ్య. | ,, |
| ౯. | కనకయ్య. | ,, |

వీరు కాక ఒక బుఱ్ఱకథ దళం.

స్థలం: తెలంగాణాలోని ఒక చిన్న గ్రామం.

కాలం: స్వతంత్రం వచ్చిన తరువాత గ్రామపంచాయితీలు స్థాపించబడ్డాక.

---

## కొన్ని సూచనలు.

ప్రతి రంగంముందు బుఱ్ఱకథ, ఉంటుంది కాబట్టి రంగాలంకరణ త్వర త్వరగా జరిగితే ప్రేక్షకులకు ఆలస్యం ఔతున్నట్టు చేయాల్సిన అవసరం, వ్యాకులత కలిగే అవకాశంలేదు. ప్రతి రంగం బుఱ్ఱకథ అయిపోగానే తెరలేవాలి. బుఱ్ఱకథ దళం తెరముందుండాలి. తెరలేస్తుంటే దళం తలోవైపునుంచీ నిష్క్రమించాలి. కాటమయ్యకు చేతిలో కట్టె పట్టుకుతిరిగే అలవాటు.

లింగయ్య, మంగమ్మ, కాటమయ్య పాత్రధారులకూ, ప్రాంప్టరుకూ తెలంగాణా గ్రామాల్లో మాట్లాడుకునే పల్లెభాష వచ్చి ఉండటం అవసరం.

# కీలు బొమ్మలు

## మొదటి రంగం

### బుఱ్ఱ కథ

చిత్తశుద్ధితో వినుడి పట్టణమున కుత్తర భాగమునా   తందాన తాన
కాపురాల గట్టనెడి నామమున గలనొక గ్రామంబూ   ,,
అన్ని కులముల వారికి గ్రామము ఆటపట్టు సుండీ   ,,
కాయ కష్టముల జేసి బ్రతికెడు కష్ట జీవులకునూ   ,,
కండల్ను పిండి చెమటల నోడ్చే కాపుబిడ్డలకునూ   ,,
కష్ట జీవులకు కాపుబిడ్డలకు కాపురమా వూరూ   ,,

వ. ఈలాటి గ్రామములో పెత్తనదారుడైన రామారావు పంతులు ఎలాటి వాడయ్యా అంటే.

ఇంటి ముందర రెండు శునకముల దంటగుంచెనండీ   తందాన తాన
బిక్షగానికి బిక్ష మెన్నడు పెట్టి యెరుగడండీ   ,,
ఎంగిలిచేత కాకినిసిరి కొట్టెన్నడెరుగడండీ   ,,
వీసానికి మాసం గుంజాటలా వీరి విద్దియండీ   ,,
వెండ్రుక బట్టుక కొండ వలీలగ ఎక్కేటి వాడండీ   ,,
ఆవలిస్తే పేగులు లెక్కెడు అతి యుక్తిశాలి సుండీ   ,,
చల్లటి మాటల గుట్టుల జీల్చి కొల్లగొట్టుసండీ   ,,
తన్నెదిరించిన వారినణచుటలో తనను తానె సాటీ   ,,

వ. ఈ లాటి మహాశయుడు, ఆ గ్రామ పంచాయితీ మెంబర్లను లోబరచుకొని, దాని కధ్యక్షుడైనాడు. కాని మెంబర్లలో ఒకడైన లింగయ్యా మాత్రం రామరావు గారి వలలో పడేవాడు గాడు. ఆ లింగయ ఎలాంటి వాడయ్యా అంటే.

ధర్మమంటె పెయి బట్టనుగూడ దాన మిచ్చునండి తందాన తాన.
కష్టజీవుల మీద ఎప్పుడో కన్ను వుంచునండీ ,,
తనది తప్పుగాకుంటె దైవముతో తగువులాడునండీ ,,
ధైర్యవంతుడు, దయామయుండు, ధర్మమూర్తి యండీ ,,

వ. ఈ లింగయ్యా పంచాయితీ మెంబరుగా ఎన్నుకోబడగానే—

తలకు మించినా భారము ఇప్పుడు తనపై నున్నదని తందాన తాన
తన మనసులో ఉత్సాహపడుచు తానేవో తలచుచును ,,
బిర బిర బిర బిర లింగయ్యింటికి సరగునొచ్చెనండీ ,,

(వెనుక తెర లేస్తుండగా బుఱ్ఱకథ దళం నిష్క్రమించాలి. లింగయ్యా ప్రవేశిస్తూ కట్టె పక్కకు పెట్టి హడావుడిగా)

లింగ : ఏమేయ్, పిలుస్తాంటె సెవులు ఇనపడత లేవా ఏంది ?
మంగమ్మ : (లోపల్నుంచే) వొస్తున్నొస్తున్న.
లింగ : ఇంకా వొస్తున్న కాన్నే వున్నాది ?
మంగ: (ప్రవేశించి) ఏందయ్యో ఏమో ముంచుకపోయినట్టె పిలుస్తుండవూ ?
లింగ : ముంచుకపోతుంటే నీ వస్తావా ఏందే ? సరెగని దబ్బున సా జెయ్యి.
మంగ : అంటేంది ?
లింగ : సాయంటె ఎరుకలేదానె ? ఉదుకుడుకు నీల్లల్ల ఇంతాకేసి, కసాయం తీసి, పాలబొట్టు గలిపేదానికేమో బమ్మిజ్ఞోతుగ జేస్తుండవూ ?

మంగ : ఏం బమ్మిజ్జోగని ఆడేంవో ఆకంటివి ఏమాకది ?

లింగ : ఏమాకుంటదే, సాయాకు దాంట్లేసేదే అదాయె.

మంగ : ఆదేస దొరుకుద్ది ?

లింగ : ఏడ దొరుకుద్దంటె పైసలు బారేస్తె ఏడబడితె ఆన్నె కొనుక్కొస్తె.

మంగ : దుకనాల మీదనా ?

లింగ : దుకనాల మీన గాకపోతె అడివిల దొరుకుద్దా ఎట్ల ?

మంగ : ఏడదొరుకుద్దో ఏందో, నేనెన్నడు జెయ్యనైతిని అదినాం జెయ్యొస్తా దయా ?

లింగ : సెయ్యొచ్చింది సేస్తాంబాగ, సెయ్యరాందే సెయ్యాల ? దాంట్లనే వుంది తమాస.

మంగ : ఏం తమాసో ఏందో, ఇదంత ఎట్ల గలుస్తది నాకు ?

లింగ : కలిపి ముంగల బెడుతారె, కలుపుకోవాలె గని ?

మంగ : మరిది ఏమన్నందంట ?

లింగ : ఇది మందెందుకైద్దే ?

మంగ : మరిదెందుకు దాగుతరు ?

లింగ : పానం హాయిగుండాల్నని.

మంగ : ఇద్దాగితె పానం హాయిగుంటాదయా ?

లింగ : హాయిగుంటాదయా ? హాయిగుండందే సదుముకునోల్లే ఇంత కష్టాల మీంచి లేవంగనే, సెగలు పొగలెల్తాంటె ఉడుకుడుకది సూదుకుంట దాగుతారు ?

మంగ : ఓసోసి ఆల్లకేం పానమ్మీనికొచ్చె అంత సెగలు పొగలెల్లేది దాగ టందుకు ? ఊకె సల్లారి పెట్టుకోని నిమ్మలంగ దాగేదానికి ?

లింగ : సల్లారితె దాని రుసే తేలిపోద్దంట.

మంగ : దీనికదోరోగముండాది ? మల్లింకిదేం గునమిస్తదంట ?

లింగ : [illegible] ఆలోసన బుత్తదంట. ఆకలిగూడుండదంట. ఇంకేం గునమున్నదో ఏం కతో అదంతా డాక్టర్ల కెరుక నుకో.

మంగ : అబ్బునా, ఇద్దాగితె ఆకలిగూడుండదా ఎట్టా? ఇదే బాగనే ఉండదయో......

లింగ : మరి నేను పరిగాశికాని కంటున్నానే? ఆకలుండదంటె ఉండదంట

మంగ : మల్లీద దాగటోరంత బువ్వగిన తినరా ఏంది?

లింగ : అమ్మా బువ్వల బుట్టేన పానమాయె గది లేకుంటె ఎట్లబట్టనే......

మంగ : ఆకలి గాదంటివి గద? ఊఊకనే అన్నవా?

లింగ : ఊకెందుకన్నగని, ఆకలంటె అసలు గాదన్నాను, జర అసరన్నగని

మంగ : బాగన్నవుగని, లేనిపోని ఇలువరుస బెట్టకు. ఒగాలె అంత ఆకలనిపిస్తె ఇంత బువ్వ దాగు ఏంబాయె

లింగ నేను దాగెటందుకానె ఇది?

మంగ : మల్లోరికి?

లింగ . గట్టనే పోరన్న పెద్దమడుసులు గిన వస్తరేమోనని, తీరొల్లొచ్చినాంక నువ్వు సెయ్యరాక తనుకులాడ్తవేమోనని ఇప్పుడే తరిఖీదు గప్పుంటుంటేని.

మంగ : మనింటికెందుకొస్తరు పెద్దమడ్సులు?. నువ్వున్నదే వొక్కనివైతివి. జోనమ్మా నలుగురన్నదమ్ములున్నరు. పాల్లు బంచుకుటున్నరు. తెగుతలేదవొస్తరా?

లింగ : ఇగ పాల్లుబంచుకుంటెనే రావాలెగని, ఊకెనే రావొద్దంటవా?

మంగ : ఊకెనే వొచ్చేటందుకు మనింటికి అల్లకేం పనిగిన ఉండదా ఏంది?

లింగ : నీకెవరు జెప్తరే, ఒగాలి ఊకెనే వస్తరనుకో. చుట్టపోల్లోతుగ.

మంగ : మరి ఒచ్చినోల్లను ఎన్నడన్న ఊకె దోలినమా?

లింగ : నేను గదే అంటుంది.

మంగ : ఇన్ని కోట్లులసంవొచ్చే ఏ సుట్టపాయినెను, ఊరికె దోల్లేదు. ఇగ వొచ్చే సుట్టపాయున్నా ఊరికె దోలం. వొచ్చినా, ఓ కోన్ని ఇంతే కల్లుగోట్లు దాకన్కాంట బోయిన్రా ?

లింగ : మల్లిది అందుకు దాగుతారె ?

మంగ : ఏం కల్లుగాని సుట్టపాయినె వోరొస్తరన్నా మరింటికి ?

లింగ : ఒగాల వొస్తె ?

మంగ : వొస్తై మటుక ఇది దాగనోల్లోరున్నరు ఇయ్యాల్రేపు మనకాడ.

లింగ : మనంజూడ బోయినామె ?

మంగ : మనం సూడంగ దాగెటోల్లే తక్కువ. మనం జూడకుంట దాగెటోల్లె ఎక్కువ ఇయ్యాల్రేపు.

లింగ : యహా ఊకోవే, ఓరన్న ఇనగాలె

మంగ : ఇంకేంది ఇన్నియ్యారాదు ? లేని మాటన్ననా ? గుమ్మడికాయల దొంగెవరంటె బుజాలెగిరేసినట్టు.

లింగ : ఏమో పోనియ్యే మనకెందుకా మాట ? సరెగని ఇన్నావిది ?

మంగ : ఏందది ?

లింగ : ఓశోసె ఇంక నీకెరుకలేదా ఎట్లాటిది ? ఊరంత తుక్కుడిక పోతుంటే నేమొ ?

మంగ : ఎందుకు ఏమయిందయో ?

లింగ : అయిందేంది నేను ముంచిపల్లి పక్కైదె ?

మంగ : ముంచిపలేంది ?

లింగ : అదంత నీకేడ మనుమున ఒడ్డది గని, దాంట్లె పడ్డనైతె బడ్డ.

మంగ : (ఆశ్చర్యంగా) పడ్డవా ఎందుకు పడ్డవు ?

లింగ : నా కల్ల నేనుబడ్డాను అల్లంత బడేసిరి.

మంగ: అల్లకేమొచ్చె నిన్ను బడేసెటందుకు? ఆల్లు పడేస్తె పడేటందుకు నీకు కన్ను లేవా?

లింగ: ఇటెట్టాటి కతచెప్పాన్నే, నేనొక్కన్నే పడ్డానె, రాంరావు పంతులు, గుడిగుంట్ల చెంద్రయ్యా, వుశేనుసాబు పెద్దకొడుకు కాశీం, కనకయ్యా అల్లంత ఒల్లేదే?

మంగ: ఏమువుయుఖింతో ఇటెక్కడన్నాలమవో, అల్లంటె మారాజులు. అల్లకు పడబుద్ది ఉండేమొ పడ్డరు. ఆల్లు బడ్డదిగాక నిన్నెందుకు బడేసి గయ్యో? ఇటెక్కడి గాశారం దేముడా? మూలనునోల్లను ముంగ జేస్తున్నవు దేవుడా, మేము ఏపాపం ఎరుగనోల్లం దేముడా?

లింగ: యూహ ఊకోనె. ఎర్రిదానోతె ఏడుస్తుంటవు. ఏమొచ్చెనే నీకు? ఏడిస్తందుకు.

మంగ: (ఏడుస్తూ) నేనేందుకేడుస్త దేముడా, ఆన్నెం పున్నెం ఎరుగనోల్లం దేముడా (ఏడుపు ఆపి) పెన్నన్న దెబ్బలుగిన తగుల్లేదుగద? (దగ్గరికొచ్చి చూస్తుంటె,)

లింగ: ఎక్కడెర్రిదివే, నాకెందుకు తగుల్తయే దెబ్బలూ...

మంగ: (తగ్గ స్తాయిలో శోకిస్తూ) పడ్డంక దెబ్బలు దగుల్లకుంటుంటాయయ్యో.

లింగ: నేనేడ పడ్డనే?

మంగ: నువ్వేడ పడ్డవని నేనెందుకు సూసొచ్చిన దేవుడా,

లింగ: కిందబడ్డనమకున్నావే?

మంగ: మరేడ బడ్డవు?

లింగ: ఓశోశి ముంచిపల్లిబడ్డనని ఓకాడంగ జెపుతనే వుంటిని.

మంగ: అదంటేందో చెప్పనైతివి గద?

లింగ: ఇగదంత యాడజెప్పాకుంటు గూసుందును, అదో గాప్పు సంగం లే. దాంటెనే నా కేరెక్కిచ్చెను.)

మం : ఓరినన్ను దిట్టపోతివా, వోరితో నన్ను పంచాయితి గిన పెట్టుకుంటివా, నీ పేరెందు కెక్కించబోయింరు దాంట్ల?

లింగ : ఇగ నీకేమని చెప్పుదునే, నన్ను మన అడకట్టుకు పెద్దమడిసిని జేసింరంటుంటే నేనేమో.

మం : నిన్నెందుకు జేసింరు, ఎన్నటి సంది మన కులపెద్ద పెద్దయ్య వుండనే వుండెంగ.

లింగ : అయినే నన్ను ఒట్టుకోని జర అచ్చరాలు గిన నేరుస్తుండవు, వుండరా అంటె వుంటిని.

మంగ : మరి ఆ అచ్చరాలో ఏందో, గదెందుకు నేర్వబోతివి లేందిపోంది.

లింగ : ఇన్నాల్లేదు నాలుగచ్చరాలు పొట్టలబడితే దేనికైనా మంచిది గాదె?

మంగ : గది బెట్టుకుంటెనే గిన్నొచ్చిపడె. మల్లిప్పుడు నువ్వింత పెద్దమడుసులు గారా ఎట్ట?

లింగ : కారని వోరన్నరు? అడకట్టుకో పెద్దమడిసిని పటితే వోట్లేసి ఏరుకున్నరు.

మంగ : వోరేరు కొమ్మంటె ఏర్పుకున్నరు?

లింగ : వోరేరుకోమ్మంటె ఏరుకుంటారె? అల్లకే ఏరుకో బద్దయిందట ఏరుకున్నరు. సర్కారోరుగూడ సై అన్నరు.

మంగ : మల్లీల్లంత ఏం జెయ్యాలె?

లింగ : ఏముండది, ఊల్లె సడకులేపిచ్చుడు, బావులు దీపిచ్చుడు పంచాయితులు గిన జెప్పుడు. ఇంకా.........

(ఇంతలో బాపన రంగయ్యగారు హరేరామ అంటూ ప్రవేశించాలి)

లింగ : దండం బెడతనుండీ, దండం బెడ్తు, (భార్యను చూచి) చూస్తుండవేంటే ఎర్రిదాన ఓ పీట ఒట్కూరాకా, (పంతులుతో) రారి, రారి, (భార్యను జూసి) ఇంక జూస్తుండవేందిరో, (మంగమ్మ లోపలికి వెళుతుంది) నీ కాల్గొన్నెక్కు రాక రాక ఒచ్చిరనే మా యింటికి పెద్దలు.

రంగ : ఏదో అలా పనిమీద వెళుతూ, మనవాడు పంచాయితీ మెంబరయి నాడు కదా, పలకరించి పోదామని వచ్చా.

మంగ : (పీటదెచ్చి వేసి) కూసోరిట్టు, (రంగయ్య కూర్చుంటాడు భార్యా భర్తలిద్దరూ దండం పెడతారు).

రంగ : దీర్ఘాయుష్మాన్ భవ, పుత్రపౌత్రాభి వృద్ధిరస్తు. (దండం బెట్టి మంగమ్మ వెళ్ళి పోతుంది)

లింగ : ఆఁ ఇగజెప్పూరి రాక రాక సనాల్లకొస్తిరి ?

రంగ : మొన్న మీ ఊరికి పెళ్ళికొచ్చానుగదూ ?

లింగ : ఆఁ గప్పుడే వస్తిరి ? ఇంకెప్పుడొస్తిరి ?

రంగ : పని పడ్డప్పుడల్లా వస్తూనే వుంటాగా, అన్నట్టు నీతో ఓ చిన్న పని బడ్డదోయి.

లింగ : నాతో నానుండి ?

రంగ : ఔను నీతోనే, కాకపోతే, ఇంకెవరితోని ?

లింగ : చెప్పూరి నానుంచయ్యేది మీకు గాదంటనా? ఎన్నడన్న గాదంటినా?

రంగ : అందుకేగా నీ దగ్గరకొచ్చింది. నీవిప్పుడు పంచాయితీ మెంబరువు గదూ ?

లింగ : అల్లంత గలిసి నే రెక్కిచ్చిన్రు లేరి

రంగ : ఎక్కిస్తేనేం నీకిప్పుడు బృహస్పతి పదకొండిట ఉన్నదన్నమాట.

లింగ : ఉంటె మంచిదంటరా ?

రంగ : ఓ దివ్యంగా, అన్నట్టు మన యింటి ప్రహరీగోడ ఉన్నది చూశావు?

లింగ : ఓశోసి గజ్జా శ్లేదానుండి గట్లిమాట్లాడుతరూ ?

రంగ : ఆ గోడ కొద్దిగా బజారుకున్నదని, దాని వలన బండ్లు పోక పోకలకూ కష్టమౌతుందని మా పంచాయితీ అధ్యక్షుడు రాంరావు దాన్ని కూల గొట్టాలని, అన్నాడట. అనుకునేందుకు చాలా కారణాలున్నాయితే అదంతా ఇప్పుడెందుకు? ప్రస్తుతం ఎట్లాగయినా దాన్ని ఆపేటట్టు నీవు చూడాలి.

లింగ : అమ్మో ఆరు ఊరికి పెద్దమనుసులు. ఆరతోటి చెప్పలేస్తానుండి. ఒగాల నేను చెప్పినా ఇంటడా ఆయన.

రంగ : నువ్వు పంచాయితీ మెంబరువేగా ?

లింగ : మెంబర్నైగని జర ఆరు పెద్ద మనుసులుగారు ?

రంగ : నీవు మాత్రం తక్కువా ? సరైతే చెప్పిచూడు.

లింగ : (నసుగుతూ) చెప్పేదుకేందిగని ఆరన్నట్టు, ఆ గోడ జర ఇరకటంగనే ఉండది. ఆడ ఎన్ని బండ్లు బోల్తబడ్డయి చెప్పురి మీరే.

రంగ : ఔను నా ప్రహరీగోడ తగిలి బండ్లు బోల్తబడ్డమాట నిజమే. అయితే ఆ రామరావు గారింటిముందున్న అరుగుదాకి ఎన్ని బండ్లు, ఎన్ని సార్లు బోల్తపడ్డేదు ? అది మాత్రం ఇరుగ్గా లేదంటావా ?

లింగ : (నసుగుతూ నెత్తి గోక్కుంటూ) ఉండది గని.........

రంగ : గనీ గినీ లేదోయి మొట్టమొదట ఆయన అరుగు దీసివేయమను. నా ప్రహరీగోడా నేను దీసేస్త తెలిసిందా ?

లింగ : అట్నె లేరి. ఆరి అరుగుబోంది మీగోడ బోనిస్తానుండి నాదెబ్బుగాల దాంట్లె నా మాట సాగాలెగని.

రంగ : ఎందుకు సాగదు? వాళ్ళందరికి ఎంత అధికారముందో నీకూ అంతే అధికారముంది. తెలిసిందా?

లింగ : రామరావు పంతులుకున్నంత అధికారం నాకున్నదంటరా ?

రంగ : ఓ దివ్యంగా.

లింగ : గట్ల జెప్పురి. ఇగొట్లయితె సరె పోరి.

రంగ : రేపు మీటింగున్నది. దాంట్లో ఇవన్ని చర్చకు రావచ్చు. అప్పుడు కొద్దిగా నా సైపు............

లింగ : ఇగ ఎరుకలేదానుండి, రేపు మిటింగె గనుక ఉంటె అడిగేదేందో అడిగేతీర్త ననుకోరి.

రంగ : రేపంటే రేపే కాకపోవచ్చు ఎప్పుడుంటే అప్పుడే.

లింగ : ఎప్పుడున్నా అడుగుత లేరి నాకేమన్న బయమా ?

రంగ : సరె అయితె నేను వెళ్ళొస్త.

లింగ : అయ్యో అయ్యో గింత సావ దాగిపోరి. పెద్దమడుసులు ఊకె పోతెట్ల? ఏమే.

రంగ : అంత ప్రేముంటే చాల్లే...తాగినట్టే...వస్తామరి.

లింగ : సర్లెరి దండం బెట్త. (రంగయ్య వెళ్లిపోతాడు.) (కాటమయ్య వస్తాడు)

కాట : ఏం మావాఁ బాపనాయెనతో నేమొ సనా మాట్లాడుతుండవు ?

లింగ : మాట్లాడుతున్నవంటె ఏంమాటూరి ? ఇయ్యాల్రేపు ముంచిపల్ల పెద్ద మడిసినైతి. ఓరన్న పనిబడ్డోల్లొస్తె మాట్లాడకుంటె ఎట్లగుదుర్తది.

కాట : మాట్లాడొద్దని వోరన్నరుగని మామాఁ నాకు జర పనివడ్డదె.

లింగ : చెపరాదుర నాతోని కాని పనుండాది? మిస్సాలు దిప్పినోరు నా తానికి రావాలె ఏమనుకుంటుండవో గని ?

కాట : నా కెరుక లేదానె మాఁవా. సరెగని మాయింటికి పక్క గోడ బెట్టుకో వాల్నని అను కుంటుండనే.

లింగ : పెట్టుకోరాదుర ఇప్పుడోరొద్దన్నరు ?

కాటు : అదేందో వచ్చాగిన గీసి పంచాయితిల జూపాస్నట గాదె? మళ్ల ఆన్నుంచి ఊకుం పీసుకోవాల్నంట.

లింగ : గిదోటుండాది దీంట్ల ?

కాటు : ఔనటనే మావా.

లింగ : అదెట్లాటిదె ముచ్చటో నేను గనుక్కుంటుగాని, మళ్లి లెవ్వ నువ్వు.

కాటు : ఇంట్లెనేకే మావా పోతుంట.

లింగ : పంతులుగిదొస్తుండేమెం నూతేలు (పంతులు ప్రవేశం).

కాటు : ఇగోదె పంతులు రానే వచ్చె.

లింగ : దండముండి పంతులు దండం జెస్త. నిప్పుడే అనుకుంటుండంగనె వచ్చిను. నిండ నూరేండ్లాయుస్సుండయుండి మీకు. (పంతులు ప్రతి నమస్కారం చేసి, మందహాసం చేస్తాడు)

కాటు : ఇగ బొమ్మంటవా మావా

లింగ : పోదువుగని కూకోరాదుర అట్ల.

పంతు: అన్నట్టు లింగయ్యా ఇప్పుడు నీవు పంచాయితి మెంబరువే కాదూ?

లింగ : అది మా కేరుక లేదాగని, ఒద్దనంగ బడేసినేముండి అల్లంత గలిసి ముంచిపల్ల.

పంతు : ముంచిపలేమిటి? మ్యునిసిపల్ అంటారుగాని, అయినా మన గ్రామంలో అవి లేవే?

లింగ : మళ్లిప్పుడున్న దాన్నేమంటరుండి ?

పంతు: ఏమంటరు ? గ్రామ పంచాయితి అంటారు.

లింగ : అంటరేమొ పాడయి. అల్లంత అనుకుంటె నేననుకున్న లేరి, ఐనా ఇది ఏన్నల్లేని కొత్త చిత్రమాయె.

పంతు: మన దేశంలో ఇది కొత్తేంకాదు. పూర్వం కొంత కాలంపాటు గ్రామ పంచాయితీల ద్వారానే ప్రభుత్వం నడిచింది. మనకు స్వతంత్రంవచ్చిం తరువాత వారిని ప్రభుత్వం పునరుద్ధరిస్తుంది. మన కిప్పుడు ప్రజా రాజ్యం వచ్చింది. గ్రామ పంచాయితులకు ప్రజా ప్రతినిధులు ఎన్ను కోబడుతారు. దానిలో నీవూ ఒకడివి, నిన్ను ఎన్నుకొన్న వారికి నీవు న్యాయం చేయాలి.

లింగ : అన్యాలం నా జన్మలున్యాదుండీ. నాగ్గనుంటిదంటే గిట్టదు లేరి. అయితే పంతులూ ఇంగట్లయితే అన్యాలం జరుగదంటారు?

పంతు : జరుగ కూడదు కాని, జరిగే అవకాశాలు చాలా ఉన్నాయి ఎందు కంటావా కొంతమంది మేధావంతులు, తమకిష్టమున్నట్లు అధికారాన్ని నడుపుకునేందుకు ప్రజలను కీలు బొమ్మలుగా జేసుకుని ఆడిస్తుంటారు.

లింగ : ఇగాల్లాడిస్తావుంటె మనం ఆడుడే అంటరా ఏంది ?

పంతు: ప్రజలు విజ్ఞానవంతులై పురోగమించేదాకా ఇలాంటి అవక తవకలు జరుగుతునే వుంటాయి.

లింగ : ఇగ ఇట్లంటె నా అనుంటోన్ని దాంట్లెకుబోయి సాయంజేసుడెట్ల కుదుర్తదుండీ ?

పంతు: ఎందుకు కుదరదూ ? న్యాయమని నీకు తోచినదాన్ని ఎవరెన్ని విధాల నిరోధించాలని చూశినా న్యాయంకోసం పట్టుపట్టడం నీవిధి. ఏదైన క్లిష్టసమయం వచ్చినప్పుడు మేధావుల సలహాలు పొందుతూవుండాలి.

లింగ : మేదావులో ఏందో అంటిరి ? అంటె సదువుగిన నేర్చినోళ్లే అంటరా ?

పంతు: బాగా చదువుకుని విచక్షణా జ్ఞానంకలిగిన విజ్ఞానవంతుణ్ణి మేధావి అని అంటుంటారు.

లింగ : ఇంగిసుంటోళ్లే నాయాన్ని అన్నాలం అన్నాలాన్ని నాయం మెల్కాలు పెట్టికిందికి మీదికి జేస్తుంరు. మీరేమన్నా అన్నిరి నా మనసులున్న మాటన్న.

పంతు: అదీ నిజమే. ఆ శక్తి వాళ్ళకే ఉండటం అనేది ఒప్పుకోదగ్గ విషయమే.

లింగ : ఈ సదువులు గిన్ని మెలికలున్నాయండి. సూడబోతేది సదువులతోని మంచి జేసుడు కంటె చెడు జేసుడే ఎక్కువ జేస్తున్నది గద?

పంతు: అలాగంటే ఎట్లా లింగయ్యా? నిప్పున్నది చూశావు .........

లింగ : ఓ సోశి సజ్జాడక పోవుడేందుండి. ఎట్లమాట్లాడుతరూ?

పంతు: చూశ్చేదనవంటే. ఆ నిప్పును కొంపలు తగల పెట్టడానికీ, కూడు వండుకోవడానికీ, ఎన్నో విధాల ఉపయోగించుకోవచ్చుగా. ఐనప్పుడు దాన్ని మంచికే ఉపయోగించుకోవాలి కాని అసలానిప్పే వద్దంటామా?

లింగ : ఐతె సదువుగూడ నిప్పసుంటిదంటారు?

పంతు: ఔను ఈ చదువు మంచికోసం వినియోగించడం చదువుకున్నవారి విధి.

లింగ : మా పంచాయితిల పోరన్న అన్యాయం జెయ్యనియ్యరాదురి నా మెంబరుతనం బోతె బోయిందిగని. సోకింటానుండి.

పంతు: ఆఁ అదే నేననేది? సరె. నీ చదువు ఎంత వరకొచ్చింది?

లింగ : అట్టిట్టు తిప్పలబడి అదేందో అమ్మాన్నె, దానెనుకది ఆహా ఏదో గాదుండి. నీ రొండు నోటికి బట్టిచ్చిన.

పంతు: మరి తతిమ్మవి?

లింగ : అవెన్నో అయ్యేటట్టు లేదుండి. అది 'కా' గాదుండి 'క' చిన్నంగ నోటికి బట్టిచ్చినగని పలకమీద్దామంటె పాడైది అది మూడాన్నాలు గొంకలు దిరిగె. దీనెన్నదైతె చెడబడ మెల్కాలు దిరిగింది. ఎప్పటికీ అచ్చరాలేసిన మారాజులోరోగని జర సక్కంగేస్తె ఏంబోయె నుండీ, గిన్నొంకలు బెట్టిండూ?

పంతు: సర్లే, తరువాత చెప్తతా. ఇప్పుడు కొన్ని నోటి లెక్కలడుగుత చెప్పుతవా ?

లింగ : అంటేందుండి.

పంతు: మామూలుగ రెండూ రెండు ఎంత అని అడుగుతా ననుకో.

లింగ : మీా కేరుక లేదా నుండీ నన్నడుగుత నంటరు ?

పంతు: నా కెరుక లేదని కాదు నిన్నడిగి తెలుసుకుందామని.

లింగ : మరిగ ఏమడుగుతరో అడుగురి.

పంతు: నీ దగ్గర ఓ పది రూపాయలున్న యనుకో.

లింగ : లేందెట్లనుకొమ్మంటరుండీ,

పంతు: లెక్క కట్లనుకోవాలె ?

లింగ : అట్లంటారు ?

పంతు: ఆ పదిరూపాయల్లో ఈ కాటమయ్యొక ఐదురూపాయలు తీసుకుంటే ఏమైతుంది.

లింగ : ఏమైద్దేందుండి చెడబడ పంచాయితైద్ది. తీసుకుంటుంటె ఊకుంటా నుండి చూసుకుంట.

కాట: ఏం మాఁవా పంతుల్ని మొసలకుండ జేస్తివే నీ ఏటుగాల.

లింగ : యాహ నువ్వూకోరా...

తెర

## రెండో రంగం

### బుజ్జి కథ

ఎట్లనైతే సేం లింగయబాబూ ఎంతో కష్టపడీ తందాన తాన
ఓనమాలు వరుసగ ఒక్కొక్కటి వల్లించేశాడు ,,

పట్టినపట్టూ విడుచుట లింగయ పుట్టిపెరుగడండీ తందాన తాన
నిద్రాహారమునుమాని గుణితమును నేర్వ మొదలు పెట్టె ,,
సంతకమిప్పుడు తానే స్వయముగ పెట్ట నేర్చినాడూ ,,

వ. ఇది ఇలావుండగా ఒకనాడు—

భళానంటి భాయి తమ్ముడా దేవభళానంటి సోదరా, భాయి భళానోయి తమ్ముడా.

పంచాయితి అధ్యక్షుడు సై
పంచాయితి మెంబర్లనూ ,,
సమావేశ పరచంగనూ ,,
సత్వరముగ నందరికినీ ,,

హుకుములుజారీ చేసెనూ జారిచేసిపంపించెనూ. భళానంటి భాయి...

వ. అందరికి హుకములు వచ్చినట్టుగనే లింగయబాబునుగూడా వచ్చింది. అది చూసి............

వంత: ఏం చేసిండు ?

కథకు: చెపుతా విను.

కలిగిన అంబలా గంజో చిటికెలా గుటికెడు తాగేసి తందాన తాన
భార్యను పిలిచి వెళ్లివస్తనని పలుకరించితాను ,,
నెత్తిరుమాలు కాళ్లకు చెప్పులు నోటచుట్ట పెట్టె ,,
అడుగులోన అడుగేసుకుంటు అతి త్వరగ నడుచుకుంటు ,,
చేర వచ్చెలింగయ పంచాయితి కార్యస్థలమునకు ,,
చుట్టవిసిరిపారేసి దండము పెట్టె పంతులుకునూ ,,

(తెర లేస్తుండగా బుర్రకథదళం నిష్క్రమణ, పంచాయితి మెంబర్లంతా కుర్చీల మీద కూర్చొని ఉంటారు లింగయ్య ప్రవేశిస్తూ)

లింగ : దండం పంతులూ దండం బెట్త.

రామరావు: రా లింగన్నా రా.

లింగ : అవున్నా నీకాల్లుమొక్త. ఎన్నల్లేంది లింగన్నా అంటిరే.

రాం : అనొద్దా ఏం ?

లింగ : ఎంతన్నా ఏలుకేలు కంతరువుండదుండి? లింగా అనాలిమరి. అంతక్కైతె లింగాయ్ అని. లింగన్నేందుండి లింగన్న.

రాం : ఈ రోజుల్లో ఇంకా అంతరువుందా ? అందరూ ఒక్కటే అంతా సమానమే.

లింగ : ఉత్త మాటలు.

రాం : నిజమోయి లింగయ్యా నిజం.

లింగ : ఇయ్యన్ని పై మాటలుండి. ఎన్నటికి నీకు బానిస్యాకుంటె ఇయ్యాల్రేపు జర గాలి బారనిస్తుంరు. గంతే తేడనుకోరి ఎన్నటి కిప్పటికి.

రాం : నీవన్నది కొంత వరకైనా............

లింగ : కొంతేందుండి అంతనక ?

రాం : సరే కాని కూర్చోముందు నీ కొరకే ఎదురు చూస్తున్నాం.

లింగ : అంత పనిబడ్డాదుండి నాతోని ?

రాం : నీవు లేకుండా ఈ సమావేశం ఎలా జరుగుతుంది ?

లింగ : అన్నాకథ. నేను లేకుంటె ఏది జరుగకూడదని.

రాం : ఔను. ఎలా జరుగుతుంది ?

లింగ : దెబ్బగాల గంతకాడికొచ్చినాదుండి ?

రాం : మాట్లాడుతూ అలాగే నిలబడిపొయ్యావేం ? కూర్చో. ఆకుర్చీమీద కూర్చో......

మని ఈడ గూకుంటునంటే కుదరదంటుంటారి ? మీరు పెద్దమనుసులు ఒక్క తీరుగన్నందుకు కూసుందామన్నా మీవోతుగ కాల్లుకిందికాలా జేసి, కూసోవస్తామండి నాకు ? మల్లి గూకుంటే కాల్లు గుంజాక పోవు ?

కనకయ్య : పేమంపరం కూర్చోవడంలా ?

లింగ : మీరంటె అల్లివాటునోల్లరు ఎట్ల బడితె అట్ల గూకుంటరు.

రాం : నీవూ నీయిష్టం వచ్చినట్టు కూర్చుందు వద. (అని లాక్కుపోబోతాడు)

లింగ : నేనే వస్త నసురి,

రాం : రామరి ? (లింగయ్య కుర్చీదాకావచ్చి దాన్ని అటూఇటూ వూపి చూస్తాడు) ఏం చూస్తున్నావోయి ?

లింగ : ఏమిలేదుండి, దబుక్కున గూసుంటె వోలుపుద్దేమోనని పశానతు జేస్తుండ.

రాం : ఏం వోలువదు కూర్చో.

లింగ : (కట్టె పక్కకానిచ్చి, గొంగడి కుర్చిమీద వేసి, మొకాళ్లమీద వెనకకు ఆనకుంద కూర్చుంటాడు)

రాం : ఏం అలా కూర్చున్నావు ? వెనకకు అనుకుని కూర్చో.

లింగ : అవ్మో ఎనక్కానుకుంటె అట్నే, ఎల్లెలకల బడిపోనుండి ?

రాం : ఏం పడవు కూర్చో.

లింగ : మీరు గట్నే అంటరు. పడ్డాక ఆనుకుంటె ఒస్తదా ?

రాం : పరవాలేదు కూర్చో. ఇక మన కార్యక్రమం కానివ్వండి.

లింగ : దబుక్కున లేచి ఈపని నాశాత గాదుండి. ఇంతెక్కటంల గూసో పెడితె నాకేడ గూసోవస్తదుండి ? ఇటు మెసలరాదాయె అటు మెసలరాదాయె పాడయి. ఇటుపక్కన నిలబడ్తనేరి: (అని పక్కకు నిలబడతాడు).

కనక : ఎంతసేపని అలా నిలబడతావు ?

లింగ : ఎంతసేపేంటండి తెల్లారిందాక నిలబడమంటే నిలబడతానండి ?

రాం : సరే ఆ పక్కనైనా కూర్చో.

లింగ : గట్ల జెప్పరి నీ కాల్లు మొక్కుత. ఈడ్నె కూకుంట.

రాం : ఊఁ కానివ్వండి.

కనక : కానివ్వమంటరా ?

రాం : కానివ్వమనే అంటుంటేగా ?

కనక : మన గ్రామంలో ఎండాకాలం వచ్చిందంటే నీళ్ళదొరక్క చాలా కష్ట పడాల్సి ఉంటుంది. అది మీ అందరికి తెలిసిన విషయమే. పశువు లకు కూడా నీళ్ళు కరువు అవుతాయి.

లిం : (లేచి) మనుసులు దాగటందుకే వుండయిగని పసువుల కంటకేండి పసులు. (కూర్చుంటాడు)

కనక: నేనదేగా అంటుంది ? అసలు మన గ్రామం మొత్తానికి రెండే రెండు బావులున్నాయి

లింగ : (లేచి) ఓబాయికైతే ఎప్పుడు మోట గిరకే ఉండవుగాదండి ?

కనక : అవును బాగా చెప్పావుగాని, కూర్చుంటే కూర్చోనన్నా కూర్చో లేకుంటే నిల్చోనైనా నిల్చో. ఇదేమిటి ? కిందికీ మీదికీ బస్కీలు దీయటం ?

కాశీం: బిల్కుల్ ఠీక్ కహాదియా.

రాం : అతనిష్టం వచ్చినట్టు చెయ్యనియ్యండి మీరేమనకండి.

కాశీం: ఏ భీ సచ్ హై.

రాం : ఊఁ కానివ్వండి.

కనక : ఈ రెండు బావుల్లో గ్రామం మొత్తానికి నీళ్ళు చాలక ఎంతో అవస్థ పడాల్సి ఉంటుంది.

కాశీం సయి బాత్ హై.

లిం : మా ఆడట్లుకైతె అసలే లేదుండి బాయి. మేం పతినిచ్చం ఒకూత పెట్టు నెల బోవాలె.

చంద్ర. ఎవరి ఒజారుకున్నదని.

కాశీం: ఏభీ సచ్ హై.

కనక : అసేగా నేనూ చెప్పేది కనీసం మన గ్రామం మొత్తానికి ఇంకా ఆరు బావులైనా కావాలి. ప్రస్తుతం ఈ ఆరు బావులను త్రవ్వించా లంటే చాలినంత డబ్బు మనదగ్గర లేదు. అందుకని కనీసంపక్షం రెండు బావులైనా ప్రస్తుతం త్రవ్వించాలని నా ప్రతిపాదన.

అందరు : అలాగే కానివ్వండి.

కనక : ఏం కాశీం నువ్వేమంటావు ?

కాశీం : నేనుభి అదే కహలాయిస్తుంది గద ?

కనక : మీరందరు ఒప్పుకున్నందుకు నాకు చాలసంతోషం ఐతే ఈరెండు బావులు ఏ ఏ బజార్లలో త్రవ్వించాలో, మీరే సూచిస్తే బాగుం టుంది.

లింగ : (లేచి) నన్ను జెపమంటూరు ?

కనక : నిలబడ్డావెందుకు ? కూర్చొనే చెప్పరాదు ?

లింగ : జర నిలబడితెనే నాకు బాగ జెప్పొస్తది.

చంద్రయ్య : పోనీ నిలబడే చెప్పు.

లింగ : తెల్సో తెల్వకనో నేనోమాటంట సూడ్రి. మా ఆడకట్లోల్లంత కూలినాలి జనం. పొదుగాల లెవ్వంగనే ఇంత బువ్వగిన వొండు

కూస్తే అంటే, ఇంత గంజి దాగ్రనే అంటే జాడవోరక్కుంటు పోతరు ఆల్లికు ఆరు అరాంవి ఉండాన్నంటే ఓబాయసుంటేది ఉంటే పొద్దుగాల ఇన్ని నీల్లు దెమ్మకోని ఇంత బువ్వొండుకుంటరు. పని మీన పోతరు. ఇప్పుడంటే ఓ కూత పెట్టునేల బోలేక ఎటుమటూన ఎదుకుండరు. అందుకని మా అడకట్టున ఓ బాయి తోవ్విస్తె శనా ఫరెన్నైముంటది? తెలుసుకుంటరు ఏమంటరు?

రాం : మొత్తమ్మీద మీ వాడకో బావి కావాలంటావు, అంతేగా!

లింగ : గంతేనుండి నన్నడుగుతరేంది మీ కెరుక లేదా?

రాం : నీ అభిప్రాయమేమిటి కాశిం?

కాశిం : మాక్కో ఏక్ కూనా పంతుల్.

వెంకట్ : మాబజారుక్కూడ చాలా అవసరమండీ.

కనక : మీరేమన్నానండి. మాబజారు వాళ్ళకు ఓ బావి ఎట్లాగైనా తవ్విస్తా నని వాగ్దానం చేశాను. కాబట్టి మా బజారుకు బావి త్రవ్వించ్చక పోతే బాగుండదు ... మాటపోతుంది.

లింగ : గట్లంటే అసలే కదరదు.

చంద్ర : మా బజారుకే తప్పకుండ కావాలె.

కాశిం: మా బజార్కో భీ.

రాం : అబ్బా, ఏమిటీ గొడవ ప్రస్తుతం ఈ సమస్య ఆపేసి అందరం పరిష్కరిం చేది రెండో సమస్య ఎత్తుకుందాం.

లింగ : నన్ను చెప్పమంటారు?

చంద్ర : ఊం చెప్పు.

లింగ : నాకేమీ బాగ చెప్పరాదు. ఎట్లనుండి?

కనక : నీకు చెప్పొచ్చినట్టే చెప్పు.

సింగ : ఐతె ఇగని. ఇయ్యాల్రేపు కలిగంపినాన, కొత్త కొత్త చిత్రాలు బుట్టుకోస్తున్నాయి. ఆడోల్లు మొగోల్లంత సదువుకోనికెగబడ్డరు పతోల్లిప్పుడు సదువుకోనికే మొగ్గుతాన్రు. ఇగ ఇదుంటప్పుడు పతోరు నాలు సచ్చరాలు పొట్టతేసుకొంటె కుదిరేటట్టు లేదు. మల్ల మా అసుంటి ముసలోల్లకు గూడ ఇప్పుడు సదుమ్మోవద కాయిసు బడ్డది. మన కెందుకనుకుందామంటె సదువచ్చినోరు డొంకతిరుగుడు మాటలు జెప్పి ఎరుకలేనోల్లను దోంగబుచ్చి బొంగలకు దోలుక పోతాన్రు. గియ్యన్ని జూసి నాగ్గూడ సదువుకోన పానం గొట్టుకుంటుందది. గందుకని మనూల్లె గూడ ఓ బడసుంటదది జేడితె బాగనిపిస్తుందది.

కాశిం : సయీ బాత్ హై. నాకూ భీ జర తెలంగి సదువు సదవాలని కాయిసు హై.

రాం : మీ అందరికీ బడి కావాలని ఉందా ?

సింగ : బడొద్దని ఉంటాదుండి ఓరికన్నా ?

రాం : అందరి అభిప్రాయం తెలుసుకోవాలె గద ?

సింగ : తెలుసుకోరి దాందేంది.

రాం : మాట్లాడరేం ఏమంటరు ?

అందరు : కావాలి కావాలి.

రాం : ఏం కాశిం మాట్లాడవేం ?

కాశిం : సబ్కీ బాత్ మేకీ బాత్.

రాం : ఐతే బడిపంతులుగా ఎవ్వరిని వేస్తె బాగుంటుందో, మీరేనిర్ణయించండి.

లింగ : వోరికెందుకు బెట్టాలున్నండి ? ఇన్నాల్లున్నంచి నలుగురు పిల్లల బెట్టుకోని తిప్పలు బడుతున్న మన శాస్త్రీ పంతులు లేడు ? ఆయిన్నే పెడదాం.

కనక : అవసరం లేదు. నా పెద్దకొడుకు శివయ్య మాట్రిక్ పాసైనాడు, ఇంతవరకెక్కడా ఉద్యోగం కూడా దొరకలేదు. వాణ్ణి వేస్తే బాగా చెప్పగలడు కూడా.

లింగ : సదువంగానే అయిపోయినాదండి? చెప్పే తరీక గూడ ఎరకుండాల. ఐనా ఈన మాత్రం ఏట్నా సదివినాడు. మూణ్నాలుగు సదువులు సదివియ లేదండి.

కనక : మా వాడికి కూడా అనుభవం ఉంది, అతనికంటె బాగా చెప్పగలడని, గ్యారంటీ ఇస్తా. తెలిసిందా?

లింగ : ఎట్టిపాడైపొద్దండీ ఇంత బూమినిట్ట ఉన్నోళ్లుగూడా నౌకర్లకెగబడితె ఎగసాయం జేసుకోక ఏది లేనోరి నోట్టె మన్నుబోసుడు గాకపోతె ఏందుండిది?

చంద్ర : వీళ్లిద్దరొద్దండి మా అన్నకొడుకును బెడ్దాం. వీళ్లిద్దరికంటె బాగా చదువున్నవాడు బాగా చెప్పగలడు కూడ.

కాశిం: ఇస్కే కోయీ నకో పంతుల్, మాద్రసే జొలేకూ బులాయింగే.

మిగతా అందరూ : వీల్లేదు అదెప్పుడూ కుదరదు. మన వూరివాడే కావాలి

రాం : ఆగండి ఆగండి. ప్రస్తుతం ఈ సమస్యకూడా ఆపండి. ఇంకొకటి చర్చిద్దాం.

లింగ : ఆదేందో మీరె చెప్పరి చూదాం.

రాం : ఐతే వినండి. ప్రజలు ఆరోగ్యంగా ఉండాలంటే, గ్రామం ఆరోగ్యంగా ఉండాలి. గ్రామం ఆరోగ్యంగా ఉండాలంటే ప్రతి బజారు విశాలంగా పెంటదిబ్బలూ అవీ ఉండకుండా మురికి కాలువలు బజార్లో ప్రవహించకుండా, అరికట్టాలి. పై చెప్పిన విధంగా అన్నిటిని ఒక్కసారే చేయలేం. సాధ్యం కాదుకూడ.

కావున మొట్టమొదలు సాధ్యమయ్యే కొన్ని పనులు చేద్దాం. అందుకొరకు ప్రప్రథమం బజార్లు విశాలంగా ఉండి బండ్లు అవీ బోల్తపడి ప్రమాదాల పాలుగాకుండా చూడాలని నా అభిప్రాయం.

చంద్ర : ఇది చాలా ముఖ్యమైన పనండీ.

రాం : అందుకని, బాటలకు అడ్డంగా వచ్చే రాళ్ళూ రప్పలూ, తీపించవేయాలి అంతేకాదు. చిన్న చిన్న గోడలు, బాటలమీదికొచ్చి బండ్లరాకపోకలకు ఆటంకంగా ఉండకుండా చూడాలి.

లింగ : మరిగియ్యన్ని పోతేనే బాటలు బాగయితయి. లేకుంటెట్లయితయండి ?

రాం : మరీపని ఏ బజారునుండి ప్రారంభిద్దామంటరు ?

లింగ : పెదబజారుకాన్నుంచి గానియ్యరి. దేనికైన మంచిది.

కాశిం : సయి బాత్ హై.

కనక : వీల్లేదండి పెద్దబజారును బాగుచెయ్యాలంటే పైసలు గూడ ఎక్కువ కర్చు అవుతవి.

రాం : పోనీయండి మన పాలెం బాటనుండి రంగయ ఇంటిముందునుంచి రాంపురం బాటవరకు బాగు చేసిద్దాం. పైసలుగూడా తక్కువకర్చు అవుతవి.

లింగ : నా కెరుకే లేరి. తిప్పికొచ్చి తిప్పికొచ్చి, రంగయగారి గోడకు బేదుతుసు ముప్పు ఉన్న ఊల్లెగిసుంటి పంచాయితులు బాగుండవుండి. నాగ్గిసుంటియంటే నచ్చయి.

రాం : అసలు నేను రంగయ్యగారి గోడ అన్లేదే ?

లింగ : ఏరే పేరుపెట్టి అనాల్నా లేరి, సూర్రి. మీరిప్పుడా గోడ దీసెయ్యాల్నంటె పంచాయతిల ఒస్తవి. ఇదోరుకే ఊల్లె రొండు పార్టీలు నడుస్తుండయి. నా మాటిన్రి. ఇప్పుడు గిసుంటియి బెట్టుకున్రి. మీకు ఆరికి పడిఒడకపోతె గిప్పుడేనాసన్రి సందు.

రాం : (కొద్దిగా కోపంతో) లింగయ్యా నీవు లేనిపోంది కల్పించకు. నేను అందరి బాగుమాటున్నాను కాని నా స్వంతం గురించి కాదే.

కాశీం: బిలుకుల్ సచ్ హాయ్.

కనక : అయ్యయ్యో ఆలాటి మాటంటారా మీరు ?

రాం : నిజంగా రంగయ్యగారి గోడ బాటకడ్డంగా ఉండి బండ్లకిబ్బందిగా ఉంటె తీసెయ్యడం తప్పా ?

లింగ : తప్పని వోరంటుండరుగని, గిప్పుడు గిసుంటియి వొద్దని అంటుండ.

కనక : నువ్వద్దంటే కుదురుతుందోయి.

లింగ : కుదురదంటె దానికెల్లిది గుదురుతాది ? కుదిరిచ్చుకోవాలె గని ఊల్లె పంచాయితి బెరగకుంట జూడాల్నని అనుకుంటుండ.

రాం : మరిప్పుడు పంచాయితీ బెట్టుకోవాలని ఎవరు జూస్తున్నారు ? మీ మాటలు నా కర్థం గావడం లేదే ?

లింగ : ఇప్పుడే అంటిరి గదుండి ? రంగయ్యగోడ దీసేస్తె తప్పా అని.

రాం : ఔను అన్నా. ఉన్నమాటే అన్నాగా తప్పేముంది ?

లింగ : ఉన్నమాట వోరన్నా తప్పులేదంటరా ?

రాం : ఉన్నమాట అనడంలో తప్పేంలేదు.

లింగ : మరి గట్లయితె ఆరిగోడ దీసెయ్యాలని మీరన్నరనుకోరి. ఆరేమొ మీ అరుగుగూడ బాటకిరకటంగా ఉంది తీసెయ్యమంటరు. దానికేమంటరు ?

రాం : ఆయనంటున్నాడా నీవే అంటున్నావా ఈమాట ?

లింగ : వోరింకేముందండి ? సూడబోతె మీ ఆరుకాడ ఎన్నిమాట్లు బండ్లు బోల్తబళ్లే.

రాం : లింగయ్యా, నీకు మంచిమాటలతో చెప్తున్నా, ఆలోచించి మాట్లాడు.

లింగ : ఇప్పుడు నేను అడ్డగోలుగ మాట్లాడుతున్నానండి. మీరు గట్నె అంటరు.

కనక : ఇవ్వన్ని చెప్పుడు మాటలండి. రంగయ్య ఏదో నూరిపోశినట్టున్నాడు.

లింగ : నడుమ నువ్వెందుకు మాట్లాడుతవు చెప్పు.

కనక : నేను పట్టిన కుందేలుకు మూడేకాళ్ళనడం తప్ప ఇంకొకటి తెలువదు.

లింగ : అవ్వో ఆమాట మేం అంటె కలుస్తాది ?

రాం : నీకు బాగా తెలియని విషయాలు మాట్లాడకు.

లింగ : నాకేడ దెలుస్తయండి. నాకు దెలుస్తె గిట్లెందుకుండును ? నేను మీవోతుగనే ఉందును.

రాం : మరిప్పుడుండరాదు మించిపోయిందేముంది ?

లింగ : మల్లినాకు కనకయ్యోతుగ ఆల్లకీల్లకు జుట్టు జుట్టు.........

కనక : చూశారా రాంరావుగారూ అలుసిస్తే లింగయ నోటికొచ్చినట్టు మాట్లాడుతున్నాడు.

రాం : ఏం లింగయ్యా ఇక్కడాలాంటి మాటలు పనికిరావు తెలుసా ? నిన్ను నేను ఎంతో మర్యాదగా చూస్తున్నాను.

లింగ : ఇగది కనపడతనే ఉండె ఏరె చెప్పాన్నా ?

రాం చూడండి నేనెంత సంజాయించి మాట్లాడబోయినా తలకెక్కించుకోక పోతే ఏంచెయ్యాలె చెప్పండి. వీడికి వీడి చిన్నాయనకు ఆ రోజు గెట్టుమీద జరిగిన పంచాయితిని చెప్పి వీడికి ఎంతో సహాయం చేశానే, అదయినా జ్ఞాపకం ఉండాలా? నోటికొచ్చినోటలా మాట్లా

చేస్తే ఎవరయినా ఎంతకని ఊరుక్కుంటారు ?

లింగ : పెద్దల మాటలకు అడ్డం లేదనుకుంటారు? సానం జేసిన్నంటుంపరు గని ప్రస్నానికి జేసినారుండి. మీ కోడుకు పెండ్లంటె ఓ గొర్రె పిల్లియ్యాలె.

రాం : ఇదిగో లింగయ్యా, ఆకరుసారి చెప్తున్నాను. నీ మాటలన్నీ విన్నాను. నీవు పిచ్చి పిచ్చిగా మాట్లాడావంటే ఇక ఏమాత్రం సహించేది లేదు.

కాశిం: గడబడా ఎంమ్యా పంతుల్... జర అయిస్తా అనుకోండి.

రాం : ఏమైనా సరే. ఇంకోసారి పిచ్చిగా మాట్లాడితే సహించేది లేదు.

లింగ : ఊకె కెడ్డిరనికైనట్ల అయిద్దనరాదురి.

రాం : చూస్తున్నారుగా మీరంత ?

కనక : ఏం లింగయ్యా పెద్దా చిన్నా లేకుండా మాట్లాడుతున్నావు, కయ్యం బెట్టుకోవాలనొచ్చావా ఏం ?

లింగ : నా పనే అదాయె ఏమనుకుంటుండరు ?

రాం : చూస్తున్నారా, కాశిం చంద్రయ్యా ?

చంద : మమ్ముంలేమనుమంటరు చెప్పండి. మాకూ ఓపిక లేదాయె ఆయనకూ ఓపిక లేదాయె.

కాశిం: ఏ బిల్కుల్ సచ్ హై.

రాం : తగవు జెప్ప పెద్దమ్మాఅంటె దూడ బట్టె నాదే అన్నట్లుంది. నా లాంటి వాణ్ణి ఈ లింగయ అరగు తీసెయ్యమని అంటాడా.

చంద్ర : ఏదో పోనీయండి.

రాం : ఇంత ధైర్యం ఎక్కణ్ణుంచి వచ్చిందాఅని ?

లింగ : ధైర్యంలేక వారికన్న బాకా ? వారన్న జుట్టుకు సమురుబూసి సాదింరా ?

కనక : ఇక్కడ మనం మాట్లాడటం లాభంలేదండి.

చంద్ర: యింతదానికీ అంతదానికీ పంచాయితీ పెంచుకోవడం మంచిదికాదండీ పెద్దవారు మీరయినా ఓపిక ఉండాలి.

రాం : ఇంకేం ఓపికోయి చంద్రియ్యా ఓపిక అనేదానికి అంతూ పంతూ ఉండనవసరం లేదా ? నువ్వూ అట్లే మాట్లాడుతున్నావు ?

కన : వీళ్లంతా అంతేనండి.

చంద్రి: మే మేమన్నామండి.

రాం : ఇంక వేరే అనాలా ? నాగ్గూడ ఓపికలేదు అన్నావుగదూ, నాకే ఓపిక లేకుంటె ఏంకావాలో అదే అయిపోవు. ఈలింగయ్య ధైర్యంగా ఇంతమాత్రం మాట్లడేవాడా ?

కనక : ఈ అవమానాన్ని సహించేది లేదండి.

రాం : మనం వెళ్లుదాం పదండి.

కాశిం: అరే క్యాహూయిజీ ఇంతా జల్దీ కరేతో ఏం ఫాయిదా ?

రాం : నీకు తెలియదు వూరుకో.

చంద్ర: తెల్సో తెలియకో అన్నమాటలు పట్టుకొని మీరు తొందర పడడం బాగులేదు.

రాం : ఇది తెలియకన్న మాటలేనా ?

చంద్ర : పోనీయండి పెంచకండి. అయినా అతనన్నదికూడ పెద్దతప్పుగా కనపడటం లేదు.

కనక : ఐతే రాంరావుగారిదే తప్పంతా అంటావా ? బాగుంది.

రాం : అంటావా ఏమిటి ? అంటూనే వుంటే.

లింగ : మీరు పోయొచ్చేరు పోతిరిగని నాతప్పు నాపొట్టేసి పోరి. మీరు రంగయ్యగారి నోటబాట కిరస్కాటంగుండని కూలగొట్టాన్నన్నారు. నేను మీ అయ్యగూడ ఇస్కాటంగుండి కూలగొట్టమన్న. ఐతె దీంట్లనా తప్పేందుండి. మహా అంటురుగని. మీరు పెద్దలనా? మీ మాటలు సాగుతయనా నుండి? వోరిమీదికి బడితె ఆరిమీదికెగ బడతరు.

కనక : చూడండి రాంరావుగారూ ? ఇతనింకా పెద్దగా మాట్లాడటం మనం వినడం ఏం బాగా లేదు. వెళ్ళుదాం పదండి.

రాం : (లేచి) ఇంక ఇక్కడొక్క నిమిషం కూడా వుండేదిలేదు.

కనక : ఈ అవమానాన్ని సహించేదిలేదు పదండి. (కనకయ్య, రాంరావుతో పాటు చంద్రయ్య వెళ్ళారు.)

లింగ : యహాపోరి సాగొచ్చిన మాటలు మహా అంటురుగని.

కాశిం: క్యారె లింగయా జర సబర్ జేస్తె అచ్ఛాహైనారె.

లింగ : నీకేమెరుక ఈళ్ల సంగతి ఉన్నదున్నట్టంటె మన్నట్టయిద్ది.

కాశిం: ఏభీ సచ్ హై. మగర్ అవూ మంచి మనిషి కాదు. మన పెద్ద ఊరన్ని..........

లింగ : అయ్యోదేంగో కానీ ఏహా. రోల్లె తలబెట్టి రోక్కన్న కెరుస్తె అయితాది పని ?

తెర

మూ. నం. ౪౦౫౦

## బుర్ర కథ

రంగయ్య రామయ్య పాతపగలతో రగులుకుంది జ్వాలా తందాన తానా
తమదే సాగాలనెడి మాటలతో తగవు పెరిగినాది ,,
మాటకు మాటా పెరిగి అప్పుడే కోటలు దాటాయి ,,

వంత: తరువాతేంజరిగిందన్నయ్యా ?

కథకు: ఏం జరిగిందా ?

భళానంటిభాయి తమ్ముడా మేలు భళానోయి తమ్ముడా
రాంభళానోయి సోదరా

రామయ కనకయ కలిసిరీ సై
మొటమొదలె ఈ మొక్కను ,,
త్రుంచివేయవలె నంచును ,,
చక్కగ ఆలోచించిరీ ,,

కుతంత్ర బుద్ధితో ఇద్దరూ కుట్రజేయ ప్లానేసిరీ భళానంటి.........

వంత: ఐతె ఏం జరిగిందేం ?

కథకు: ఈ విషయాలన్నీ తెలుసుకున్న పంతులు...

భళా నంటిభాయి తమ్ముడా మెల్భళానంటి తమ్ముడా
రాంభళానోయిసోదరా,

కలహాదేవతా ఊరిలో సై
కాళ్లకు గజ్జెలు కట్టుక ,,

నృత్యము జేసే సమయము ॥పై॥
సమయంబొచ్చే యిప్పుడూ ,,

అప్పుడెట్లని మనసులో ఆలోచన జేయుచు నుండెను. భళానంటి...

(ఆలోచిస్తూ నెత్తి గోక్కుంటూ పంతులు పచార్లు చేస్తున్నాడు. ఇంతలో కాటమయ్య వచ్చాడు)

కాట: దండం పంతులూ దండం పెడత.

పం : ఏం కాటమయ్యా ఎక్కడికీ ప్రయాణం?

కాట: ఏడికున్నదుండీ మా లింగయ్యా సూమున్నదేమోనని పోతున్న.

పం : ఊం హూం సరె, మొన్న మీటింగులో ఏంజరిగిందో తెలుసా?

కాట: ఏం జరిగెనుండీ, ఏమన్న దెబ్బలు వొబ్బులు గినా ఆయెనా?

పం : అంతదాకా వొచ్చిందట.

కాట: దేని మీదొచ్చిందుండి అందాంకనో...

పం : రంగయ్యగారి గోడ బాటమీదికున్నది దానివల్ల బండ్లు రాకపోకలకు ప్రమాదం ఉంది ఆగోడ కూలగొట్టించాలని రాంరావు సూచించాడట. మన లింగయ్యేమో మీ ఇంటి ముందరి అరుగుకూడా ప్రమాదంగానే వుంది. అదికూడా తీసేస్తే బాగుంటుందన్నాడట.

కాట: ఉన్నమాటన్నడు తప్పేందుండి.

పం : దాంతో ముదిరి ఇంతవరకొచ్చిందట.

కాట: అంత కాడికొచ్చినాదుండి. ఆడ కనకయ్యా, సాయెబు, చంద్రయ్యా వీళ్లంత ఉండ్రి గద?

పం : వాళ్లలో కొంత తెలిసివాడు కనకయ్య, ఆయన రాంరావుకు తాళం వేసేవాడేగా? ఇక మిగతా ఇద్దరు ఎవరిని ఏమంటె ఏం ముంచు కొస్తుందోనని ఊరుకున్నారటలే.

కాటు: మీరుమన్న మాఁవతోటన్నంగ కాడికొచ్చిందన్నమాట. ఇగాల్లు ఏంజేసినా ఏమన్న మనం ఊకోవాలంటరా? దేంట్ల జూసిన ఆత్రే పెద్దలైరి ఎట్లనుండి.

పం : అదే నేనూ ఆలోచిస్తున్న.

కాటు: సదుముకునోల్లరు గింత సేపాలోచిచ్చాల్నానుండి.

పం : తట్టొద్దూ, అఁ మనమంతా కలిసి వోటర్ల సంఘం స్థాపిస్తే?

కాటు: ఇదేవో కొత్త పేరోతుగ ఉండదే...

పం : ఔను ఇది కొత్తే చూడు మనం ఓట్లు వేస్తేనేగా వీళ్లంతా పెద్ద మనుషులైంది. మన సమస్యలను పరిష్కరించడానికి మనకోసం మన శ్రేయస్సుకోసం పని చేయడానికి, వీరందరినీ వోట్లువేసి మన మెన్నుకున్నామన్నమాట. మన శ్రేయస్సుకోసం పని జేస్తారనుకుని, వీరినెన్నుకుంటే, మనకే ఎసరు దెస్తుంటే మనం ఊరోక్కుండా మనం ఎన్నుకున్నవారిమీద వొత్తిడి తేవాలె.

కాటు: అంటేందుండి?

పం : మనక్కావలసిన సౌకర్యాలు చేయడానికి వీరిని మనం కోరుకున్నామన్నమాట.

కాటు: ఈల్లందరిని వోరు కోరుకో బోయిన్రుండీ.

పం : అందరు కలిసి వోట్లేశారుగా?

కాటు: వోటంటె అదేంవో చీటిచ్చి, డబ్బాల ఏయమంటె ఏస్తిమి?

పం : అదే ఆ చీటీయే నీ వోటు. ఆ చీటి ఏ పెట్టెలో వేస్తే, వారిని నువ్వు కోరుకున్నట్లు...

కాటు: నాకు సమవేరాదాయె గా చీటేందో గదేందో నాకే మెరుకుండీ.

పం : పోనీ నీవు వేయనైతే వేశావా?

కాటి ఏమిటంటె మా మామ చచ్చిపోయి ఏడాదయింటె ఏస్తిని. గదేమంటరా వోటంటె?

పం : ఔనుమరి?

కాటి : మరింకేందో సంగమంటిరేంద ?

పం : వోటేసిన వాళ్లంతా కలిసి వోటర్ల సంఘం పెట్టుకుందామని.

కాటి : పెట్టుకోని?

పం : మన మెన్నుకున్న పెద్దమనుష్యులకు మనం వారినెందుకెన్నుకున్నామో మరచిపోకుండా పదే పదే జ్ఞాపకంజేస్తూ, మనసమస్యలను మరచిపోయి వారిలో వారు తగవులు పెట్టుకుంటున్నప్పుడు, మన కోరికలను చెవిని పెట్టనప్పుడు వారిని దిగిపొమ్మని వత్తిడి తెద్దాం.

కాటి : అట్ల జెయ్యొచ్చునంటరా?

పం : మనమంతా కలిస్తే, అన్నీ చెయ్యొచ్చు.

కాటి : అట్ల గుదుర్తదంటారు? మల్ల వోట్లేసేనాడు సర్కారు మనుషులుండిరి. అట్లాకుంటూరుండి.

పం : అదంతా మన ఐక్యత మీద ఆధారపడి ఉంటుంది.

కాటి : ఐతే అదేందో మీరన్న సంగం పెడదామంటరా?

పం : పెట్టాలనేగా నేననేది?

కాటి : ఐతే మరింగెప్పుడంటువు?

పం : ఎప్పుడేమిటి రేపు సాయంత్రానికే అందరం కలుద్దాం.

కాటి : మా లింగయామాముంటె బాగుంటదుండె.

పం : అవును లింగయ్యతో మాట్లాడాలి. కొద్దిగా నేను రమ్మన్నానని చెప్పుమా అక్కడికే వెళ్ళుతున్నావుగా.

కాటి : ఆడికే పోతున్నగని పొలంబోయి వచ్చిండో రాలేదో.

పం : సాయంత్రిందాకా రాడా?

కాటు : ఎందుకండీ పొద్దుండంగనే వస్తడు.

పం : పోనీ ఇప్పుడింటికొచ్చింక లేండి, కాస్త చూచి చెబుదా.

కాటు : పర్లేరి సూశ్తోస్త. వెళ్లిపోవును (ఇంతలో కాశిం చంద్రియ్యా ఎదురుగా వస్తారు).

చంద్ర : నమస్కారం పంతులూ నమస్కారం.

పం : నమస్కారం.

కాశిం: సలాం వాలేకుం.

పం : వాలేకుమ్సలాం. ఆఁ ఇద్దరుకసి ఎటో వెళుతున్నట్టుందే,

కాశిం: ఏడ్కీ హుండవి పంతుల్ మీకే కల్నె...

చంద్ర: మీతో కొద్దిగా సలహా తీసుకుందామని వచ్చాం లెండి. ఏం కాశిం ?

కాశిం: నేన్భి అదే అంటుందిగద ?

పం : ఆఁ సరే చెప్పండి. నేను మీకు ఏం సహాయం చేయగలుగుతానో ?

కాశిం: కుచ్భి నయిఁ పంతుల్ రాంరావు కుచ్ గడ్ బిడ్.........

చంద్ర: నీవూరుకో కాశిం నేను చెప్తా.

కాశిం: ఫిర్ బోలోనా పంతుల్క...

చంద్ర: చూడండి, రాంరావు గారూ కనకయ్య యిద్దరుకలిసి.........

కాశిం: జో పంతుల్ కుచ్ గడ్ బిడ్...

చంద్ర: నన్ను చెప్పనైనా చెప్పనివ్వు నీవైనా చెప్పు.

కాశిం: అచ్చా భాయి బోలో...

చంద్ర: కొద్దిగా డబ్బు కాజేసినట్టు మా కనుమానం వుంది. లెక్కలు చూపించమంటే మీరెవరు నన్నడిగెటందుకు ? మీకేం అధికారం లేదని నిష్కర్షగా చెప్పేస్తున్నాడు.

కాశిం: సచ్ కహదియా చెంద్రియభాయి సచ్ కహదియా ... ఇదీ మతలబ్ పంతుల్...

పం : కాజేసేంత అంత డబ్బు మీ పంచాయితీలో ఉండదే.....

కాశిం: క్యాబాత్ బోలే పంతుల్, అగర్ అదే అయితే సర్కార్ ఊకుంబర్......

చంద్ర: అదేమంటే మొన్న మున్సిపాల్టీ గాంధీ విగ్రహం స్థాపిద్దామని బాదాపు ౧౫౦౦ రూపాయలదాకా వసూలు చేశారు చూడండి.

పం : ఓహో అదా సంగతి. వారే కనక మెక్కుకుంటారు ?

చంద్ర: ఇద్దరూ ఒకటే అనుకోండి. గట్టిగా అడుగుదామంటే ఏంకేస్తారోనని భయం? మొన్న లింగయ్య ఏదో అన్నమాటంటేనే, ఎంతో కోపంతో సభలోనుంచి వెళ్లిపోయారు.

కాశిం: సహి బాత్ హై.

పం : మనదగ్గర ఐక్యత లేకపోతే యిలాగే జరుగుతుంది, చూడండి ఒక పుల్లను సాధారణంగా విరిచేయవచ్చు కాని నాలుగు పుల్లలను కలిపి విరిచివేయడం సాధ్యమవుతుందా ? ఐక్యత లేకపోతే బలం లేదు.

కాశిం: జీ తేరహో పంతుల్ ఠీకేకహా బిలుకుల్ సచ్ కహాదియా.

పం : మనం సాధారణంగా మన తోటివానికి అపకారం జరుగుతున్నా, మనకేం బట్టిందిలే అని చూస్తూ ఊరుకుంటాం.

కాశిం: ఏభీ సచ్ హై.

పం : కాని క్రమంగా మనపైకి వచ్చినప్పుడు తొందర పడతాం. అప్పుడు ఇతరులు మనకేం బట్టిందిలే అని చూస్తూ ఊరుకుంటే ఊరుకోనియ్యం పైగా ఇతరులు మనకు సహాయం చేయనందుకు మన వ్యతిరేకి అని అనుకుంటాం. ఇప్పుడు మీరన్నట్టు మొన్న మీటింగులో ఏదో ఒక సత్యమయిన మాటనే లింగయ అన్నా, రాంరావు కోప్పడుతున్నప్పుడు మీరు గట్టిగా ఏమనలేక పోయారు.

చంద్ర: నిజం పంతులూ నిజం. కాని అంత ధైర్యం...

కాశిం: హత్తెరేకి హవాకోవోయి హిమ్మతు లేని మాట మాట్లాడుతవ్...
పం : సరే ఆలోచిద్దాం.
కాశిం: అదీ చెంద్రయా భాయి. జైట్ కే సబ్ కుచ్ పంతుల్కి చెప్పు. నేనూ అభీ వస్తా జరా కాం హై.
చంద్ర: తొందరగా రా.
కాశిం: హరే భాయి ఇప్పుడూ రాన్ (వెళ్ళిపోవును కాటమయ్య వచ్చి)
కాట: పంతులూ మా లింగయ మాకొచ్చెనా యీాడికి?
పం : ఏదీ రాలేదే...
కాట: యింటికి రాలేమగదుండ్లీ పతినిచ్చెం పొద్దుగాలొచ్చెటోడు.
(తెరలో మనిషిని దెబ్బకొట్టిన ధ్వని 'అమ్మా' అని అరుపూ వినపడతాయి),
పం : ఏం చప్పుడది ?
కాట: ఆతురతలో మా మామ అనుపోతుగ అనిపించె నేమండి.
చంద్ర: అవును. లింగయ్య మాటవలె నే ఉన్నది. (అటూఇటూ చూస్తుంటారు ఇంతలో లింగయ్య పుర్రెపగిలి రక్తం కారుతుండగా సోలుతూ స్టేజీ పైకి వచ్చి నిలువలేక పడిపోతాడు).
కాట: మామా మామా (పంతులూ కాటమయ్య లింగయ్యను లేపి పంతులు లింగయ గాయంపైన చెయ్యివేసి పట్టుకొనును).
లింగ : (కొద్దిగా తేరుకొని) కాటమయ్యా పంతులూ (అని యిద్దరివైపు చూచును)
పంతు: ఏం జరిగింది లింగయ్యా.
చంద్ర : ఏం జరిగిందేం జరిగింది ?
కాట : కనపడత లేదానుండి వోరో కొట్టినట్టు. (కాటమయ్యకు దుఃఖం కోపం ఒక్కేసారి వచ్చాయి).

చంద్ర: ఆగుమంటే ఆగేంది కాటమయ్యా ?

లింగ : ఒ కానంగ రాంరావు పంతులు గాదంటె ఇట్ల ఉరుకులు బెడ్తడేము ?

కాట : నువ్వాకుండే మాఁవ చనం సేవు. (విడిపించుకోన ప్రయత్నిస్తాడు).

చంద్ర: చెప్పంగ వినకపోతె చెడంగ జూడ వలసి వస్తుంది.

కాట: చెడేదేందో ఇంతకు ముందు చెడనే చెడితిమి (ప్రయత్నిస్తానే ఉంటాడు).

లింగ : వా పానముండంగ బోనిత్త్రా నిన్ను ఆరి తానికి.

కాట: నువ్వ గట్లంటె ఎట్ల మాఁవ ? నువ్వాకోరాదె (ప్రయత్నిస్తుంటెగా)

( తెర )

## నాలుగో రంగం

### బుర్ర కథ

(దుఃఖం)

కుట్ర కుతంత్రము చేత లింగయను కొట్టినారు మనుచూ తందానో...
అందరి మనసులో ఈ విచారమూ అలుముకొన్నదండీ ,,
పాత పగల ఫలితంబు యిదే యని వెతల బొందిరండీ ,,
కర్తవ్యము మనకేది యటంచును కలత జెందిరండీ ,,

వంత : పాపం తరువాత ?

కథ :

ఈ వార్తా తిన్నగ యింటింటికి తిరుగుచున్నదండీ తందాన తాన
రామయ కనకయ గుండె దడ దడ కొట్టుకున్నదండీ ,,

ప్రళయము ముందు ఇంక ఏమో రానున్నది యన్నటుల కంజాన తావ
తుక తుక తుక తుక గ్రామము ఉడికెను దిక్కులు పిక్కటిల ,,

కన : ఈలాంటి పరిస్థితిని రామారావు బాగా పరికించినవాడై కనకయ్యను చేరబిలిచి, కనకయ్యా ఇది విను అని "ఎప్పటికెయ్యది ప్రస్తుత మప్పటికా మాటలాడి అన్యుల మనముల్...

పంత: నొప్పించక తానొవ్వక తప్పించుక తిరుగు వాడూ ధన్యుడు సుమతీ. అని చెప్పిండంటవు. అయితే తరువాత ఏం జరిగింది.

కన : అదుగో ఆ చాటింపు విను. నీకే తెలుస్తుంది. (తెరలో చాటింపు నిష్క్రిమణం)

చాటింపు: ఇనోళ్లెవరో వినలేదోళ్లెవరో, ఇప్పుడు కచ్చేరి బండకాడ సభ జరుగుతుంది. ఆడోళ్లు మొగోళ్లు అందరు సభకాడికి రావాలహో. (ఇంకోసారి యుడే. తెర లేస్తుంది. కాశిం, చంద్రయ్యా,—గుత్తపత్తో కాటమయ్యా ఉంటారు. పంతులు ఉపన్యసిస్తున్నాడు)

పం : సోదర సోదరీ మణులారా, ఈరోజు మనమంతా, ఒక్కచోట, ప్రజాస్వామికంలో వస్తున్న దుష్ఫలితాలను నిరోధించుకోవడానికి కూడాం. పరదేశీయుల ఇనుప పంజరంలోంచి ప్రజాబలం ఉచ్చు త్రెంచుక బయటపడింది. మనకోసం మనద్వారా మన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసుకున్నాం. గాంధీజీ సిద్ధాంతాన్ననుసరించి గ్రామ పంచాయితీలు ఏర్పాటు చేసుకుంటున్నాం. ఐతే మన లాభంకోసం మనం కృషి చేసుకునే స్థాయికి, ప్రజాస్వామికం అనుభవించే స్థాయికి మననింకా రాలేదని చదువు రాని ఈ ప్రజలకు ప్రజాస్వామికం వంటికి రాదని కొందరు భావిస్తున్నా నిజమేనేమో ననుకొని ప్రజలు వెనుకంజ వేయటం తెలివిమంతులు కొందరు సమయంతో లాభం పొంద

టం జరుగుతుంది. వీళ్లు మనల కీలుబొమ్మలుగా జేసి మనలో మనకు చీలికలు దెచ్చి లాభం పొందుతున్నారు. మనం త్యాగాలు చేస్తే ఫలితాన్ని ఇంకెవరో స్వార్థపరులు దొంగిలిస్తున్నారు. దీనికంతకూ గ్రామంలోని అనైక్యత కారణం. కలవారి అంతఃకలహాలవల్ల గ్రామాలు రెండేసి ముక్కలుగా విడిపోవడం జరుగుతుంది. కక్షలు సమసిపోవాలి సహకార భావం వృద్ధి కావాలి. మనం వోట్లేసి ఎన్నుకున్న వాళ్లు మనను మరచిపోకుండా చూడాలి. ప్రజాస్వామికంలో మన ప్రతినిధులమీద వొత్తిడి తెచ్చే అధికారం మనకుంది. మనమంతా ఓటర్లం. మనం ఓటర్ల సంఘం స్థాపించుకుని............(సభలో రాంరావు పంతులు వస్తున్నాడు అని కేకలు).

కాట : వస్తున్నాడు? ఈడెక్కడొస్తున్నాడు? నా దెబ్బగాల అయ్యాల దప్పుతె యియ్యాల దప్పుతాడు? (అని గుదెప దీసుకొని పోబోగా చంద్రయ్య కాశిం ఆపుతారు)

చం : కాటమయ్యా నువ్వాగు. రానివ్వండి రామారావు పంతుల్ని మనం పయనించబోయే నూతన మార్గంలో మనతో పయనించడానికి వస్తున్న రామారావు పంతులుకు స్వాగతం.

కాట : ఉత్త మాటలు. ఏదో మెక్కి పెడదామని వొస్తుండు. ఈడెక్కడైతె రానియ్యరాదు ఒక్క దెబ్బతోని...... (అంటుండగనే రాంరావు వస్తాడు) వచ్చినావు నా దెబ్బగాల సూసుకో. (అని దెబ్బగొట్టగా లింగయ్య అడ్డం వస్తాడు లింగయ్యకు దెబ్బతగిలి 'అమ్మా' అని కింద పడతాడు కాటమయ గుదుప కిందేసి) మాఁవా నీకు దగిలినాదె నువ్వెందుకడ్డమొస్తివే?

చంద్ర : నేను చెప్పలే కాటమయ్యా తొందర పడొద్దని... (దెబ్బదగిలిన చోటును చూస్తుందురు).

పం : దెబ్బదగిలిందా లింగయ్యా.

లింగ : (అవస్థ పడుతూ) లేదు లేరి.

కాట : దెబ్బదగలుకున్నాదుండి ఆటుంగజే తగిలింది. గజ్జె అంటుడుమాంవ. నన్ను సెమించు మాంవ.

లింగ : నువ్వాకుంటె సాలా సెమించినట్టె.

కాట : ఇంతోపికె యాడంగొచ్చెనే మాంవా నీకు?

పం : చూశారా లింగయగారి శాంతం? ఎంత చదువుకుంటే ఏం లాభం? లింగయలాంటి హృదయం లేంది? ఇలాంటి మనుష్యులు మనలో ఎంత మందున్నారని. పాపం రాంరావు గారికి తగిలే దెబ్బ అతనికి తగిలింది.

లింగ : ఆర్ని కూసోమని.

పం : రండి రామారావుగారూ, (సభనుద్దేశించి) వారు కొన్ని విషయాలు మీతో చెప్ప దలచుకున్నట్లుంది. చెపుతారు వినండి. (సభలో "వద్దు" "వద్దు" అని కేకలు) దేశంతోబాటు ప్రజలూ, ప్రజలతో బాటు దేశం మారుతూ వస్తుంటుంది. కాలంతో కదలిపోక కాలాన్ని ఛాడి నట్లు క్రమంగా తమతప్పు దిద్దుకుని కాలాన్ని ఆశ్రయిస్తారు. ఏవ్యక్తి ఎప్పుడూ ఒకేతీరుగా వుండదు. వారు ఏదో చెప్పదామనే ఇక్కడికి వచ్చారు వారి అభిప్రాయాన్ని కూడా చెప్పనియ్యండి.

రామ : సోదరులారా, మీకు నేను భోధలు చేయడానికి రాలేదు భోధలు చేసే అధికారం కూడా నాకు లేదు. నేను ఇన్నాళ్లనుంచి చేసిన తప్పులకు క్షమాపణ చెప్పుకోడానికి వచ్చాను. నేనేదో సాధిస్తాననుకొని అందని ఆకాశ ఫలాలకు ఆశపడి ఎత్తులు వేశాను, కుట్రలు చేశాను గ్రామాన్నీ ప్రజలనూ రెండుగా చీల్చాను. నేనేమీ సాధించలేదు. పైగా సహృదయతను చంపుకున్నాను. నాకున్న తెలివిని నేను చదువుకున్న చదువును తప్పుదారిలో ఉపయోగించాను. నాకన్న తక్కువ చదువుకున్నవాడే అయినా పంతులు తన తెలివిని సక్రమపంథాలో ఉపయోగించాడు. పంతులు విజయం సాధించాడు. నాకళ్ళు తెరి

చాడు. గ్రామంలో కక్షలు లేకుండా చేసి, మన అభివృద్ధికి మనం తీవ్రంగా కృషిచేయటంలో నేను సైతం మీతో సహకరించడానికి నడుం కట్టుకున్నాను. పంతులు సలహాలమీద, ఆయన చూపించిన రహదారిలో మన గ్రామం అభివృద్ధి కావాలని హృదయపూర్వకంగా విశ్వసిస్తున్నాను.

కం : రామరావుగారు మనతో కలసి రావడానికి సిద్ధపడ్డందుకు చాల సంతోషం. పాతపగలతో చీలిపోయిన ఈ గ్రామాన్ని ఐక్యపరచడానికి రామారావుగారిలో మార్పు మనకెంతో అవసరం. దీనికి బాధ్యులైన రంగయ్యా......... రంగయ్యగారు రాలా ?

లిం : వచ్చిండు వొచ్చిండు. (రంగయ్యగారు స్టేజీపైకొస్తారు)

పం : వీరిద్దరూ ఇక కలిసి ఉంటారు (అని రంగయ్య రామరావు చేతులు కలుపుతాడు)

రంగ: బండ్లె కిరుగ్గావున్న మాయింటి ప్రహారిగోడ రేపే కూలగొట్టి జరిపి కట్టుకుంటాను.

రామ : నేను మాయింటి అరుగును తీసేపిస్తాను. ఎప్పుడు ప్రజలు కోరితే అప్పుడు ప్రజాధనం లెక్కలు చూపిస్తాను. వోటర్ల సంఘానికి పంతులును అధ్యక్షుడుగా ఎన్నుకుని ఆయన సలహామీద ఇక ముందు మన గ్రామ పంచాయితీ గ్రామ క్షేమంకోసం పాటు పడుతుందని హామీ యిస్తున్నాను.

(కాశిం, రామరావు, చంద్రయ్య, లింగయ్య, కాటమయ్య, అంతా ఒకరికొకరు చేతులు గలుపుకుంటుంటారు)

కనక : "ఓటర్ల సంఘానికీ జై" (అంటూ కనకయ్య ప్రవేశిస్తాడు)
(కనకయ్యతో అందరూ కరచాలనం చేస్తారు)

కనక : (మళ్ళీ) ఓటర్ల సంఘానికీ (అంటే అంతా "జై" అంటారు).

[ తెర ]

సమాప్తము.

# పాత్రలు.



సత్యం.

సాధనరావు.

నవకవి.

అన్వేషి.

విలాసరావు.

మోహిని.

# నటన

## 1. వ రంగం

(కాలం: వర్తమానం. సమయం: ఉదయం 9. గం. వేళ: స్థలం: సత్యం ఇంట్లో హాలు. హాల్లో నాల్గు కుర్చీలువుంటాయి. కుడివైపు వీధి లోకి, ఎడమవైపు ఇంట్లోకి త్రోవ. తెర లేచేసరికి సత్యం ఎడమవైపు కుర్చీలో కూర్చునివుంటాడు. కొన్ని క్షణాలతర్వాత సాధనరా కుడి వైపునుండి ప్రవేశిస్తాడు.)

సాధన: ఏం మిత్రమా? ఏమిటిసంగతి?

సత్యం: (మొహం చిట్లించుకొని, అతన్ని చూడనట్టు మౌనంగా వుంటాడు.)

సాధన: (అరక్షణం ఆగి, వికటంగా) చెట్టంత స్నేహితుడు కళ్ళెదుట నిలబడి పలుకరిస్తే, బెల్లం కొట్టిన రాయిలా మాట్లాడవేం?

సత్యం: (చిరాగ్గా) ఎవడా స్నేహితుడు?

సాధన: ఎవడేమిటి? నీకు నేను స్నేహితుణ్ణి, నాకు నువ్వు స్నేహితుడివి.

సత్యం: నేను నీ స్నేహితుణ్ణా?

సాధన: అవును ముఖ్య స్నేహితుడివి.

సత్యం: అలాగయితే తక్షణం నీ స్నేహితుల జాబితాలోంచి నా పేరు కొట్టేయ్. ఇదివరకు నేనూ అలాగే అనుకున్నాను, ఇకనుండి మాత్రం కాదు, కాకూడదు. కల్మష హృదయాల్లో నాకు స్థానం లేదు.

సాధన: అయితే! నీ దృష్టిలో నేను కల్మషహృదయుణ్ణన్న మాట?

సత్యం: ముమ్మాటికి, నీకు తిరిగి అడగటానికి సిగ్గులేదూ?

సాధన: అంత సిగ్గుపడవలసిన పని నేనేం చేసేను?

సత్యం: ఏం చేసేవా? ముక్కూ మొహం తెలియని మనిషి వచ్చినా, లేని అభిమానాన్ని కల్పించుకొని, మీరు ఇంద్రులు, చంద్రులు, ఇలాంటివారు,

అలాంటివారు అని పొగడి పొగడి తీరా అతను వెళ్ళగానే; ఇతనెవరని అడుగుతే! "ఆ! ఎవడో అనాధ ప్రాత" అని నీరసంగా మాట్లాడడం ముకహ్యా—, మొహం ఎరుగనివాడి ముఖం ముందర ముచ్చటికి ఇచ్చకాలాడి, వాడు వెళ్ళిన వెంటనే వెటకారం చెయ్యడంకన్నా! ఇంకా ఏం కల్మషం కావాలి? ఛీ! ఇలాంటి మనుషులు బ్రతకడంకన్నా చావడం మంచిది.

సాధన: ఓస్! అదా—అదంత తలతీసుకు చావవలసినంతది కాదులే!

సత్యం: కాక మరేమిటి?

సాధన: అదీ "ఎటికేట్!"

సత్యం: ఎటికేటుటు! ఎటిక్వేటు! మనిషన్న తరువాత నీతి, నిజాయితీ వుండాలి అంతేకాని "అంగుట్లో అమృతం, అంతరంగంలో విషమూనా?" మనసులోంచి రానిది పైకి అనగూడదు.

సాధన: అదెలా కుదుర్తుంది? ఎవడేనావచ్చి అభిమానం కనబరచి గౌరవించి, మనని పొగడినప్పుడు; మనంకూడా వాణ్ణి గౌరవించి పొగడొద్దూ? వాడు నమస్కారంచేస్తే మనం తిరస్కారం చేస్తామా? వాడు పొగుడుతే మనం తెగడుతామా?

సత్యం: ఈ యుక్తి వాదాలకేం? ఒక శుంఠ నిన్ను గౌరవించేడని వాడ్ని పండితుడని పొగుడుతావా? ఒక వంచకుడూ, నీముందొస్తే 'పెద్ద మనిషని' గౌరవిస్తావ? ఒక వ్యభిచారిణివచ్చి నమస్కరిస్తే, 'పతివ్రతా శిరోమణి!' అని ప్రతి నమస్కారం చెస్తావ? పాత్రతా పాత్రతల్ని బట్టి గౌరవంఇవ్వాలిగాని, వాళ్ళు నిన్ను గౌరవించేరని, వార్ని నువ్వు గౌరవించిననాడు, నీలోని మానవత్వం ఏమైనట్టు? నీలోని సద్వివేక విచక్షణ ఏమైనట్టు? ఇన్నెందుకు, అన్నిరకాల మానవులకు స్నేహితుడైనవాడు నాకు స్నేహితుడు కాడు.

సాధన: నీ చింకిలెక్కల మాటకేంగాని, ఈ ప్రపంచముతో సంబంధం వున్నంతకాలం మనం చచ్చినట్టు కొన్ని 'Out ward civilities' ఆచరణలో పెట్టితీరాలి. సమయోచితంగా మాట్లాడి సమయానుకూలంగా ప్రవర్తించాలి. అందుకే మనవాళ్ళు "ఎప్పటికెయ్యది ప్రస్తు

చుకు తిరుగువాడు ధన్యుడు సుమతీ!” అన్నారు. మన జీవితంలో అబద్ధాలు ఆడవలసిన ఘట్టాలు చాలావున్నాయి. అన్నిచోట్లా వున్న దున్నట్టుగ చెప్పదామంటే కుదరదు.

సత్యం: కుదరనీ, కుదరకపోనీ; అంతరాత్మకి ఏంతోస్తే అంతా ఆచరించడమే. అంతరాత్మకి విరుద్ధంగా ప్రవర్తించడం మంచివాళ్ళ మనుషుల స్వభావం కాదు.

సాధన: యదార్థవాదంవల్ల వచ్చే ఇబ్బంది ఇబ్బందులు, కష్ట నష్టాలు, ఏమీ పూచీలేని బ్రహ్మచారివి నీకేం తెలుసు? ఎవడి లక్ష్యంలేని ఏకాకివి గనుక, అడ్డుచెప్పేవాళ్ళు లేరుగనక ఈ నిష్కల్మషత్వం, ఈ యదార్థవాదం సాగిపోతున్నాయి. ఈ ఆదర్శాలు, ఆశయాలసంగతి రేప్రొద్దున్న నీకు పెళ్ళయితే అప్పుడు తెలుస్తుంది.

సత్యం: ఏం? పెళ్ళయితే పెళ్ళాం అడ్డు చెప్తుందనా? నా అభిప్రాయాలతో ఏకీభవించేదాన్నే చేసుకుంటాను.

సాధన: అన్నట్టు నువ్వు మోహినిని.........

సత్యం: అవును. ఆమెను పెండ్లాడదామనుకుంటున్నాను.

సాధన: ఆమె నీ అభిప్రాయాలతో ఏకీభవిస్తుందనేనా నీ వుద్దేశం?

సత్యం: ఏకీభవిస్తేనే!

సాధన: ఆమె నీ అభిప్రాయాలతో ఏకీభవిస్తుందని నాకేం నమ్మకంలేదు. ఆమె అభిప్రాయాలు, ఆశయాలు నీకు శుద్ధ వ్యతిరేకాలు ఆకర్షించడం, ఆకర్షింపబడడం, ఆనందం, ఆడంబరం ఆమె జీవిత ముఖ్యలక్ష్యాలు ఈవూళ్ళో ఆమెను ప్రేమించని యువకుడులేడు. పెండ్లయినవాడు, పెండ్లవనివాడు వూరకుక్కల్లా ఆమె చుట్టూచేరి తిరిగేవాళ్ళే! ఇందులో ఎవణ్ణి ప్రేమిస్తున్నదో, ఎవణ్ణి ప్రేమించలేదో, తెలీదు. ప్రతివాడితోనూ తియ్యగా మాట్లాడుతుంది.

(ప్రవేశం: నవకవి, కుడిసైపునుండి)

నవకవి: నమస్తే! నమస్తే! (ఇద్దరికీ నమస్కారంచేస్తాడు. సత్యం తన్ను కాదన్నట్టు వూరుకుంటాడు. సాధనరావు తిరిగి నమస్కారంచేస్తాడు.

నవకవి సత్యంవైపు ఆశ్చర్యంగా చూచి భుజాలెగరేసి) (సత్యంతో) లావణ్యవాహిని అయిన మోహిని, బజారులో కనబడి, (జేబులోంచి వుత్తరంతీసి) ఈ వుత్తరం తనుచేతికిమ్మని, మనచేతికిచ్చింది. (ఉత్తరం అందించి ప్రక్కకుర్చీలో కూర్చుంటాడు.)

సత్యం: (ఉత్తరంఅందుకుని, చూసి, మీరెవరూఅన్నట్టుగా చూస్తాడు)

సాధన: ఈయన, మనమోహినిమిత్రవర్గంలో ముఖ్యులు. చక్కని కవి.

సత్యం: మీరుకవులా?

నవకవి: అవునండి! నేనో నవకవిని ఎవరో మీలాంటివారొకరిద్దరుమినహా మిగిలిన ఆంధ్రదేశమంతటా మన పేరుమారుమ్రోగు తునాది.

సత్యం: తమపేరు!

నవకవి: నాపేరు "నిరాశ" అంటారండి.

సత్యం: (ఆశ్చర్యంగా) నిరాశ? నిరాశ, దురాశ! ఇవి మనుష్యులపేర్లేనా?

నవకవి: అసలు నాపూర్తిపేరు 'నిత్యరాఘవానందశర్మ' దానిలోంచి మూడే మూడు ఆణిముత్యాలాంటి అక్షరాలు తీసి 'నిరాశ'! అని మోడరేటీ గామార్చుకున్నా. నాగరికత తెలియని మన పేరెంట్స్పూలీష్ (Foolish) గా కొండ వీటి చాంతాడులాంటి పేర్లుపెట్టేరు. ఈ రోజుల్లోకాస్త నాగరికత తెలిసినమనం, ఏవో ఆ పేర్లు పూర్తిగా కాదనకుండా మోడరేట్ గా మార్చుకున్నాం. ఎలావుందంటారు?

సత్యం: ఏడ్చినట్టుంది. మంత్రాలతోను, భజంత్రీలతోను పెద్దలు నామ కరణ మహోత్సవంచేసి, తాతపేరో! అవ్వపేరో! పెడితే. దాన్ని పీకి పాకం పట్టి అర్థం లేని అసహ్యం, అసభ్యం అయిన పేర్లు పెట్టు కోవడం దేనికి?

నవకవి: (ఉపన్యాసంలా) అదే! అదేమునవటికి ఇప్పటికీ తేడా. ఇది పడు కుని నిద్రపోయే పాతప్రపంచంకాదు. అనుక్షణం పురోగమించే నవ్య నాగరికత ప్రపంచం. ఈ ప్రపంచంలో క్షణ క్షణం నవ్యత వికాసప్రకాసాలు విజృంభిస్తునాయి. పాతరోతయి నశిస్తున్నాది. (నెమ్మదిగా) ఇప్పుడు నేనొక్కణ్ణేకాదులెండి చాలామంది మార్చుకుంటున్నారు.

సత్యం: మంచి నాగరికతే!

నవకవి: నాకో చిన్న కోరికవుంది, అది మీరుతీర్చాలి.

సత్యం: ఏమిటది?

నవకవి: మరేంలేదు. నేనో చిన్నకవిత, వ్రాశాను, అది చదువుతా, విని మీరు ఎలావుందో చెప్పాలి. అంతే!

సత్యం: అమ్మో! ఆవిషయంలో నాకు ప్రావీణ్యం లేదు. అయినా నేను చాలా మోటుమనిషిని, ఎలాతోస్తే అలా చెప్పేస్తాను.

నవకవి: అందుకే, మీరు వున్నదున్నట్టు చెప్తారనే?

సత్యం: ఆతరువాత మీరు నొచ్చుకుంటారు.

నవకవి: ఛా: ఏమి అనుకోను. మీరు వున్నదున్నట్టు చెప్తే చాలు.

సాధన: మీరు మరోలా చెప్పమన్నా చెప్పరు లెండి. అదేదో చదవండి.

నవకవి: (జేబులోంచి ఒక కాగితము తీసి, చేతో పట్టుకుని, ఉపోద్ఘాతంలా) నాకవితలోని ప్రత్యేక నవ్యత. నేటి సాహిత్యరస పిపాసులు నన్ను "నవకవి!" అని పిలువడాన్కి అదేకారణం. నేనన్నా, నాకవిత అన్నా మోహినికి అమితమైన అనురాగం. నాకవిత విన్నప్పుడల్లా మోహిని విచారిస్తూ వుంటుంది.

సాధన. ఎందుకు?

సత్యం: (వికటంగా) అర్థంకాక కాబోలు!

నవకవి: కాదు నాకవితను తాను రెండు చెవులతోను విని ఆనందించి, ఒక్కనోటితో శ్లాఘించ వలసి వస్తున్నాదని ఆమెవిచారం.

సత్యం: (వికటంగా) ఓస్! ఆమాత్రం దాన్కి విచారమెందుకు? ఓ చెవు మూసుకు వింటే సరిపోయెదిగా?

నవకవి: (దెబ్బతిని) నాకవితా మాధుర్యం ఎరుగని మీకు నా ఉపోద్ఘాత వాచకాలు ఆడంబర సూచకాలుగా కనుపించిన కనుపించవచ్చు. కాని కాస్త సంగీత ప్రవేశం వున్నవాళ్ళు. నాకవితని గానంచేస్తే, మానసం మలయమారుతాల్లో ఉయ్యాలలూగుతుంది. అయినా, తినబోయే దాని రుచి చెప్పడ మెందుకు? దురదృష్ట వశాత్తు నాకు సంగీత జ్ఞానం లేదు అందుచేత నేను చదువుతే మాధుర్యం దెబ్బ తినవచ్చు.

సత్యం: అసలు కవిత్వంలో మాధుర్యం అన్నది వుంటే ఎవరు చదివినా బాధ లేదు లెండి:

నవకవి: అలా అనకండి, "సంగీత సాంగత్యం పొందనప్పుడే సాహిత్యాని లాలిత్యం" అన్నాడు గుణ్నేశం. ఇప్పుడు నేను మీకు వినిపించబోయేది నేటి ఉదయమే వ్రాసాను. దీని పేరు "ప్రేమదరఖాస్తు" ఒక యువతిపై మనసు దగులొన్న యువకుడు, తన ప్రేమను వ్యక్తపరుస్తూ, ఆమె ప్రేమను అర్థిస్తూ పెట్టుకొన్న దరఖాస్తు ఇది! (గొంతుక సవరించుకొని కాగితం చూస్తూ చదువుతాడు)

నీమీద మోజు Darling
ప్రతిరోజూ Increasing,
నిను తలవని Morning
లేదు Dear Charming.
నిజంగా నువ్వే నా Treasure,
నా ప్రేమకు లేదు Measure,
నినుపొందడమే Pleasure!
అందాకా లేదు Loeisure

సత్యం: అయ్యో! ఇది ఆంగ్లభాషా? ఆంధ్రభాష?

నవకవి: ఆప్యాయంగా అందమైన ఆంగ్లపదాలను ఆలింగనం చేసుకొన్న ఆంధ్ర భాష. ఇదే నా నవ్యత. ఈ నవ్యతలో రమ్యత చూపెట్టడమే నాకవితలో ప్రత్యేకత.

సత్యం: ఓహో! ఇంతకీ ఇది పద్యమా? లేక గద్యమా?

నవకవి: ఇది పద్యము కాదు. గద్యమూ కాదు. పద్యంలాంటి గద్యం, గద్యం లాంటి పద్యం. హృద్యం ప్రధాన లక్ష్యంగా పెట్టుకొని నవ్యకవులు సృష్టించిన కొత్త పంథా కవిత్వం ఇది.

సత్యం: దీనికి ఛందస్సు, వ్యాకరణం.........

నవకవి: ఛీ ఛీ! అలాంటి బానిసత్వం ఏమి లేదు. కవిత్వం కట్టుబాట్లకి లోబడడం పూర్వ పంథాలో మేం కవిత్వానికి స్వేచ్ఛ ఇచ్చేం, ఛందస్సుల

సంకెళ్ళను త్రెంచి పారేసాం. పవిత్రమైన కవితామతల్లిని ఛందస్సులచే బంధించడం భావ్యంకాదని మా భావం. నవ్య కవిత్వంలో కవితాసుందరి, ఇచ్చవచ్చినరీతిని విచ్చలవిడిగా నృత్యం చేయవచ్చు.

సత్యం: అయితే మీ కవిత్వం ఈ పంథాకి చెందిందన్నమాట ?

నవకవి: అందుకు సందేహమా !

సాధన: మిగతాదికూడా......

నవకవి: (గొంతుక సవరించుకొని)

పెడ్తున్నా నీ క్షేమకు Application.
చెప్పాలి త్వరగా నీ Approbation.
చెప్పేముందర నీ Decision.
చెయ్యి సుమా Consideration.
వరాల జవరాల నువ్వు......
'ఊ' అంటే Joyfull.
"కా"కుంటే Life dull.
ఏమంటావో Jill !
ఏమన్నా నీ Will.
(ఆత్రుతతో తలపైకెత్తి) ఎలావుందండీ ?

సాధన: చాలా గమ్మత్తుగా వుందండీ.

నవకవి: సత్యంగారు మీ అభిప్రాయం కావాలి.

సత్యం: మీ కవిత్వం వల్ల లోకానికి కలిగే ఉపయోగం నాకేం కనబడటంలేదు. మీరు లోకానికి అందజేస్తున్న ఆశయ మేమిటి ?

నవకవి: మేంలోకానికి అందిస్తున్నది ఆశయం కాదు, అందమైన కవిత్వం.

సత్యం: ఆశయంలేని కవిత్వం ప్రాణంలేనిమనిషి లాంటిది. అలాంటిది వున్నా ఒకటే లేకపోయినా ఒకటే.

నవకవి: (కోపంగా) నా రచనల కోసం దేశమంతా ఉయ్యాలలూగిపోతుంటే మీకు బాగులేదూ? అసలు మీకు కవిత్వం అంటే తెలీదని నా వుద్దేశం. కవిత్వం అంటే మీకు ప్రీతిలేదని నా వుద్దేశం.

సత్యం: నా వుద్దేశం చెప్పేను అంతే! (సాధనరావు నవ్వుకుంటాడు)

నవకవి: (సాధనరావుతో) వస్తానండి! (కుడివైపు నిష్క్రమిస్తాడు)

సాధన: మంచిదండి (నవకవి వెళ్ళాక, సత్యంతో) చూశావ? ఏం జరిగిందో?

సత్యం: ఏంజరిగింది?

సాధన: అతనికి నీమీద కోపంవచ్చింది. ఇప్పటికేనా తెలిసిందా నిజం చెపితే నిష్ఠురమే ఎదురౌతుందని?

సత్యం: నా ఉద్దేశం నేను చెప్పేను. అతనికి కోపంవస్తుందని, అతని మంచి కోసమని, నిష్ఠూరానికి వెరచి, నిజం కప్పిపుచ్చి, ఆత్మని వంచించుకోమంటావ? ఛీ! బ్రతికుండగా అలాంటి పని చెయ్యను.

సాధన: నీ వేదాంతంమా నేను కాను. అన్నట్టు ఆ వుత్తరమేమిటి?

సత్యం: మోహిని తన "బర్తుడే పార్టీకి" రమ్మని నిన్నవచ్చి పిలిచినప్పుడు వస్తానో రానో చెప్పలేనన్నాను. అంచేత నాలుగు గంటలకి తప్పకుండా రావలసిందని వుత్తరం వ్రాపింది.

సాధన: సరే! సాయిత్రం అక్కడ కలుద్దాం. వస్తా! (కుడివైపు నిష్క్రమిస్తాడు.)

(సత్యం, వుత్తరం మరోసారిచూస్తూవుండగా తెరపడుతుంది).



## 2వ. రంగం.

(సమయం: అనాటి సాయంకాలం. స్థలం: మోహిని ఇంట్లో హాలు. హాలులోనుండి కుడివైపు వీధిలోకి, ఎడమవైపు ఇంట్లోకి త్రోవ. హాలుమధ్యని ఆరు కుర్చీలు అర్థ వృత్తాకారంలో అమర్చివుంటాయి. వాటిముందు రౌండు టేబులుంటుంది. దానిమీద, అద్దం, స్నో, పౌడరు మొ॥ టాయిలెట్ సామాను వుంటాయి. తెర తీసేసరికి మోహిని ఎడమవైపు కుర్చీలో కూర్చుని కూనిరాగంతీస్తూ, అద్దం చూసుకుంటూ, అప్పుడే Toilet అయినట్లు కనబడుతుంది. అరనిముషం అయినతరువాత లోపలనుండి గోడ గడియారపు టలు నాల్గు వినబడతాయి.)

మోహిని: (చేతివాచిచూచి) ఓ! నాలుగయిందే?

(ప్రవేశం: సత్యం కుడివైపునుండి)

మోహిని: (సత్యాన్ని చూచి) అపర "క్రాంటు అఫ్ మాంటీక్రిస్టో"లా, అర నిముషం అటు ఇటు కాకుండా ఆహ్వానించిన టయిముకే విచ్చేసి నందుకు ధన్యవాదాలు.

సత్యం: ఈ ధన్యవాదాల మాటకేంగాని, నువ్వు నాతో కొంతసేపు మనసు విప్పి మాట్లాడాలి. (అంటూ కుర్చీలో కూర్చుంటాడు.)

మోహిని: (వికటంగా) మనసు విప్పి మాట్లాడినా, మాట్లాడక పోయినా, నోరువిప్పి మాట్లాడతానని హామీ ఇస్తున్నాను.

సత్యం: మోహినీ! వెళాకోళానికిది వేళకాదు.

మోహిని: అంత సీరియస్ గా అడుగుతున్నావు, ఇంతకీ దేనిగురించి?

సత్యం: నువ్వు నన్ను ప్రేమించావా లేదా?

మోహిని: (చిరునవ్వుతో, గర్వంగా) ఆ విషయంలో నా అభిప్రాయం అనుకూలంగా వున్నందుకు ఆనందించు.

సత్యం: అంతమాత్రంలో లాభంలేదు. నీలో కొంత పరివర్తనరావాలి. నీ అందచందాల్ని పొగిడే వాళ్ళందరితోను భుజాలు కలిపితిరగడం నాకేం నచ్చలేదు.

మోహిని: నేను అందంగా వున్నానని అనుకున్న వాళ్ళని, అన్న వాళ్ళని తిట్టి మన్నావా? నా కటాక్ష వీక్షణాలకోసం, కరస్పర్శలకోసం కాచుకు కూచున్న వాళ్ళని కఱ్ఱపుచ్చుకు కొట్టి తరమమన్నావా?

సత్యం: కావలసింది కఱ్ఱకాదు. వాళ్ళ వర్ణనలకు, ప్రేమ కథలకు సులభంగా వశంకాని హృదయం. అడ్డమయిన వాళ్ళతోను స్నేహమేనా? ఆ విలాసరావు స్నేహం చెయ్యదగ్గవాడేనా?

మోహిని: అతనితో ఎందుకు స్నేహం చేస్తున్నానో తెలిదా? అతనివల్ల అవవల సిన పనులు బోలెడున్నాయి. నా కేసు విషయంలో తన స్నేహితు లందరితో చెప్పి సహాయంచేస్తాడని, చేస్తానని చెప్పేడుకూడాను.

సత్యం: నీ కేసుకోసం ఆ వెధవతో స్నేహం చేస్తావా? నీ కేసుపోతేపోనీ, నువ్వుమాత్రం నా శత్రువులతో స్నేహం చెయ్యకూడదు.

మోహిని: బాగుంది! మీకు మనుషులంతా శత్రువులే! ఇక స్నేహమెవరి తోటి.

సత్యం: అవును మనుషులంతా నా శత్రువులె; పైకు అనుజుల్లా నటించే ఈ మనుజులు మనుజులుకారు, మచ్చుకైనా మానవత్వంలేని మానవరూప దానవులు, మాయ, మోసం ఒకటేమిటి? స్వార్థం కోసం ఎన్నయినా నీచాలుచేస్తారు. మనసులో ఉద్దేశం ఒకటి పైకి చెప్పేదొకటి, నిలువు నిపాదం దగా! వేషాలతోబాటు మోసాలు, నాగరికతతోబాటు వంచకత్వం పెచ్చుపెరిగి పోతున్నాయి. మానవలోకం, మరోరకం దానవలోకం అయిపోతున్నాది.

(ప్రవేశం: నవకవి కుడివైపునుండి.)

నవకవి: (మోహినితో) బృందారక సుందరీ సందోహాన్ని ధిక్కరించి వెక్కిరించే నీ సౌందర్యానికి జోహార్!

మోహిని: (వీఁటంగా మీకు అతిశయోక్తి అలంకారం అంటే మక్కువ ఎక్కువ అనుకుంటా?

నవకవి: అంటే! నేనన్నది అతిసయోక్తి అంటావు. కాదు ఎంతమాత్రం కాదు. ఆ చంద్రబింబంలోనైనా మచ్చవుందికాని, ఈ వరాల

జవరాలి ముఖబింబం నిష్కళంక తేజోరాశి. ఒక్క మాటలో చెప్పాలంటే నీ అందం మాటలకందనిది.

మోహిని: మీ పాటల్లోనే కాకుండా, మాటల్లోకూడా కవిత్వం కనబడుతున్నదే!

నవకవి: (ఉపన్యాసంలా) ఒక్క నా పాటల్లోని మాటల్లోనే కాదు కవిత్వం వుంటా., ఈ సంధరాత్రి సుందర ప్రకృతి అంతా కవితామయం. ఒక్కసారి ప్రకృతిని తిలకిస్తే ఈ సత్యం బుజువవుతుంది. జలజలా ప్రవహించు సెలయేటి కలకలా రావమునందు కవితకలదు. "హరిపక్వ మంజుల ఫలరసోద్ధతములై" పలుకు చిలుకల పలుకులందు కవితకలదు, "లలిత రసాల పల్లవఖాదియై" కూయుకోయిల 'కుహూ! కుహూ!' రావమునందు కవితకలదు, ఉల్లమున కుల్లాసముగూర్చు మెల్ల మెల్లన వీచుచల్లని పిల్ల గాలులందు కవితకలదు, నను బోటియువకుల హృదయాలను అగ్నికి వెన్నలా కరగించు నిను బోటి యువతుల నేత్రాంచలములందు కవితకలదు.

మోహిని: అద్భుతం! మీ సువర్ణ వర్ణనలతో కర్ణ రసాయనం కావించినందులకు ధన్యవాదాలు. కూర్చోండి, ఇంట్లోకి వెళ్ళి ఇప్పుడే వస్తాను. (టేబులుమీద Toilet సామానులు తీసుకు ఎడమవైపు వెళ్తుంది. సత్యం చిరాకుగా మొహం పెడతాడు అతని ప్రక్కనే నవకవి కూర్చుంటాడు.)

నవకవి: సత్యంగారూ! మోహినిని నేను పెండ్లాడుతే మా 'కాంబినేషన్' ఎలావుంటుందంటారు?

సత్యం: (చిరాకుగా) అసలు దానిని గురించి ఆలోచనెందుకు లెండి?

నవకవి: ఏం? ఎందుకవదు?

సత్యం: మోహినిని నేను పెండ్లాడబోతున్నాను గనుక.

నవకవి: ఆ! అసంభవం. మోహిని నన్ను ప్రేమించింది.

సత్యం: మిమ్మల్ని ప్రేమించిందని మీరనుకుంటున్నారు. నన్ను ప్రేమించేనని ఆమె చెప్పింది.

నవకవి: పొరపాటు. మోహిని మిమ్మల్ని ప్రేమించి వుండదు, ప్రేమించ బోదు, ప్రేమించలేదు, ప్రేమించదు. ఇది కేవలం మీ భ్రమ.

సత్యం: అరిచే కుక్కలు కరవవని మోహినికి బాగా తెలుసు. అంచేత మోహిని మిమ్మల్ని ప్రేమించి వుండదని నా దృఢ విశ్వాసం.

నవకవి: (కోపంగా) అంటే? నేను అరిచే కుక్క, మీరు కరిచే కుక్కా నా? మీలాంటి బ్రూట్‌ని అలాంటి up to date girl love చేస్తున్నాదనడం నాగరికతా ప్రపంచానికే నామోషీ Don't dream like that, అలా కలగనొద్దు.

సత్యం: చెవుకోసిన మేకలా అరవడం దేనికి? మోహిని నే అడగకూడదా?

నవకవి: అడుగుతా, కొద్ది క్షణాలలో నే మీ వదనారవిందం వాడిపోతుంది.

సత్యం: నా వదనారవిందం వాడిపోయినా, వాడిపోక పోయినా, మీ ముఖారవిందం మాడిపోవడం తథ్యం.

(ప్రవేశం: మోహిని, ఎడమ వైపునుండి.)

మోహిని: ఏమిటి సంగతి? ఏదో కవితాగోష్టి నల్పుతున్నట్టున్నారు.

సత్యం: కవితాగోష్టి కాదు, కాంతాగోష్టి.

నవకవి: మోహినీ! నాదో చిన్న కోరిక వుంది.

మోహిని: కోరికోరి! చిన్న దేం? పెద్దదే కోరండి.

సత్యం: పెద్దదే లే!

నవకవి: మోహినీ! ని కనుపాపల్లో కలకాలం నా ప్రతిబింబం చూచుకు ఆనందించి తరించాలని వాంఛిస్తున్నా!

మోహిని: (నవ్వుతూ) మీ గేయరచనకన్నా; వచనరచనే బాగునట్టుకుంది. (సత్యం నవ్వుతాడు.)

నవకవి: దరహాస, పరిహాసాలకిది సమయంకాదు. పరీక్షా సమయం. నా ప్రేమని పరిగ్రహిస్తావో; పరాభవిస్తావో చెప్పాలి?

సత్యం: నేనడిగేదికూడా అదే మోహిని?

మోహిని: ఇది పరిహాసం కాకపోతే; మీరిలా పరీక్షించడం ఏమిబాగు లేదు.

నవకవి: నన్ను ప్రేమించావో, అతన్ని ప్రేమించావో, ఏదో ఒకటి చెప్పు.

మోహిని: "నన్ను ప్రేమించావ? నన్ను ప్రేమించావా?" అని మీరిలా నన్ను వేధించి బాధించడం ఏమిబాగులేదు.

సత్యం: నీ ఇష్టా యిష్టాలను స్పష్టంగా చెప్పడంలోగల కష్టమేముంది.

మోహిని: మిమ్మల్ని పిలిచింది నా జన్మదినోత్సవానికిగాని, స్వయంవర మహోత్సవానికిగాదు.

నవకవి: అవచ్చు, కాని ఆ విషయం తేలీదాకా నా మనస్సుకి శాంతిలేదు.

సత్యం: నా మనస్సుకీ అంతే!

(ప్రవేశం: విలాసరావు కుడివైపునుండి.)

విలాస: Good Evening మోహినీ!

మోహిని: Good evening? దయచెయ్యండి (కుర్చీ చూపెడుతుంది)

(ప్రవేశం: సాధనరావు పూలహారంతో కుడివైపునుండి)

సాధన: Good evening మోహినీ!

మోహిని: Good evening? దయచెయ్యండి (కుర్చీ చూపెడుతుంది.)

సాధన: నీ జన్మదినోత్సవానికి నా హృదయపూర్వక అభినందన సూచకంగా (పూలమాలవేసి, flower bunch చేతికిచ్చి కూర్చుంటాడు. సత్యంతప్ప అందరూ కరతాళ ధ్వనులు చేస్తారు.)

విలాస: (జేబులోంచి నెక్లెస్ బాక్సు తీసి అందిస్తూ) మోహినీ! నీ జన్మదినోత్సవానికి ఆనందంతో అర్పించు ఆభరణం అందుకుని అలంకరించుకో.

మోహిని: (అందుకొని, నెక్లెస్ బయటికితీసి) Beautiful! Thank you for your pretty gift

(ప్రవేశం: అన్వేషి కుడివైపునుండి)

మోహిని: (అన్వేషినిచూసి) ఓ! good evening అన్వేషి!

అన్వేషి: Very bad evening మోహినీ!

విలాస:
మోహిని: } ఆ! అదేం?

అన్వేషి: చెప్తా, మోహినీ! జన్మదినోత్సవంనాడు నీ ఉత్సాహానికి భంగం కలిగించినందుకు విచారిస్తున్నా; కాని నీ నిజరూపం తెలిసినందుకు, అది అందరకు తెలియజేయడానికి అవకాశం చిక్కినందుకు ఆనందిస్తున్నా.

విలాస: నీ మాటలేమి అర్థం కావడంలేదు.

అన్వేషి: కొద్ది క్షణాలలోనే అర్థంకావడం మోహిని మొహంతోబాటు మన మొహాలూ మాడిపోవడం తటస్థిస్తుంది.

మోహిని: (కోపంగా) అన్వేషి! అర్థంలేని అధిక ప్రసంగం చేస్తున్నావు.

అన్వేషి: అధిక ప్రసంగం కష్టంలేకే, ఆలస్యంగా వచ్చేను. అయినా తొందరగా ముగిస్తా! (జేబులోంచి ఒక కాగితం తీసి, అందరికీ చూపిస్తూ) ఇదిగో! ఇది మోహిని తన చెల్లెలికి వ్రాసిన ఉత్తరం. అందులో ముఖ్య విషయాలు చదువుతా వినండి. (మోహిని మొఖం అవమానంతో కృంగిపోతుంది. అవమానం, భయం క్రోధం మోహిని మొహంలో తాండవిస్తాయి.)

అన్వేషి: (ఉత్తరం చదువుతూ) చెల్లీ! నా స్నేహితులగూర్చి నా అభిప్రాయాలు వ్రాయమన్నావు. అందులో ముఖ్యమైనవార్ని గురించి వ్రాస్తున్నా. ఇది మాత్రం చదువుకోగానే చించీ! ఇతరుల చేతిలో పడితే ప్రమాదం. (సత్యంవైపు తిరిగి) అయ్యా! మొదట మీ గురించి వినండి! (చదువుతూ) ఇతనో విచిత్రమైన వ్యక్తి. ప్రపంచం ముందుకు వెళ్తూవుంటే, ఇతను వెనక్కి వెళ్తున్నాడు. యదార్థవాది. అంచేత లోకవిరోధి. అవసరం అయినప్పుడు కూడా, అబద్ధం ఆడలేని, అసమర్థుడూ, అపర హరిశ్చంద్రుడు అనడంలో అతిశయోక్తిలేదు. ఈ మాయామేయ ప్రపంచంలో ఇతడు బాగుపడి సుఖపడలేడు. ఇతని మీద నాకు ప్రేమకలిగింద కాని, బొత్తిగా పురాణయుగం మనిషవడం వల్ల అతని అభిప్రాయాలు నా అభిప్రాయాలు ఏకీభవించవు. అంచేత అది ఫలించక పోవచ్చును.

లను, ఇట్టే పసికట్టి, టక్కీమని పట్టేస్తాడు. అతిరహస్యాలన్నీ బట్టబయలు చేసేస్తాడు. వీడో విచిత్రమైన వుత్తరాల దొంగ నేవీడితో స్నేహం చెయ్యడంలోని ముఖ్యోద్దేశం నా వుత్తరాలు పట్టకుండా వుంటాడనే, అలాగని మనం అధైర్యపడకూడదు. వీడిచేతికి మనం దొరకకుండా జాగ్రత్తగా వుండాలి.

జనకవి: (మోహినితో) పాపం! ఎంత జాగ్రత్తగావున్నా దొరికిపోయేవ్వు

అన్వేషి: (విలాసరావు వేపుతిరిగి) అయ్యా! విలాసరావుగారు ఇహ మీ గురించి. (ఉత్తరం చదువుతూ) నేను ఎక్కువగా స్నేహంచేస్తున్నాను, ఇతనితో ఎక్కువగా ఫలితం పొందుతున్నది ఇతనివల్లే ఊరంతా, గుర్రాలుకూడా తినని అసహ్యమైన బియ్యం, తింటూన్న రేషను రోజుల్లో సన్నబియ్యపు అన్నం తిన్నానంటే, ఇతని మైత్రి ఫలమే అది. మహత్తరమైన బట్టల బ్లాకుమార్కెట్టు రోజుల్లో కూడా, కావలసినన్ని బట్టలు కంట్రోలు ధరకే దొరికేయంటే ఇతని స్నేహఫలమే అది. ఎంత దొరకని వస్తువేనా, చెప్పేసరికల్లా క్షణంలో తెప్పించేస్తాడు. నా కోర్టు వ్యవహారాలు కూడా ఇతని సహాయంవల్ల సాధించగలనని ధైర్యపడుతున్నాను. ఇతనితో ఇంత స్నేహంచేస్తున్నానంటే, దీనంతటికీ కారణం, ఇతనివల్ల మనకి అన్ని పనులు అవుతాయనే, ఇతను మంచివాడని మాత్రం కాదు. కాగడా పెట్టి వెతికినా, ఇతనిలో మంచి మచ్చుకైనా, కనబడదు ఇతనంత వంచకుడూ, కూనికోర్, బ్లాకుమార్కెటర్, నీచుడు మన జిల్లాలోనే కాదు రాజధాని మొత్తం మీద మరొకడుండబోడు. అయినా డబ్బువల్లా పలుకుబడివల్లా అవన్నీ కప్పుకుపోతున్నాయి. క్రొత్త ఆఫీసరువచ్చేసరికల్లా, రెండుమూడు వందలు ఖర్చుపెట్టి, పెద్ద డిన్నరుపార్టీ ఇచ్చేస్తాడు. దాంతో, ఆ ఆఫీసరు కుక్కలా ఇతను చెప్పినట్టు తిరుగుతాడు. ఒక్క వాక్యంలో చెప్పాలంటే, ఇలాంటి పెద్ద మనుషులుండబట్టే, మధ్యమ తరగతి ప్రజల కంట్లో కారం, నోట్లో మట్టి పడుతున్నాయి.

విలాస: (కోపంతో) ఛీ! వంచకీ, చేసిన మేలు మరచి నోటికొచ్చినట్లు విమర్శించేవు. (చేతిలో నెక్లెసు లాక్కొని) నీలాంటి విశ్వాసఘాతకకి ప్రెజంట్సు కూడానా? చూడు నిన్నేంచేస్తానో! (విసురుగ వెళ్ళిపోతాడు కుడివైపు)

నవకవి: కుటిలనటీ, జటిలమతీ! నీ విమర్శనా కౌశల్యానికి నమస్కారాలు, నీ సహవాసానికి గుడ్ బై! (కుడివైపు వెళ్ళిపోతాడు.)

అన్వేషి: మోహినీ! నువ్వు పైకి కపటంగా నటించినా, ఈ స్తరంలో తూచా తప్పకుండా తులతూచినట్లు విమర్శించినందుకు ధన్యవాదాలు.

సత్యం: అన్వేషి! నీలాంటి అన్వేషులు వీధికొక్కడు చప్పున వుంటే దేశంలో వెనకాతుల గోతులు త్రవ్వడాలు చాలావరకూ నశించిపోను.

అన్వేషి: మీలాంటివారు వూరుకొక్కరు కూడా లేని తరువాత, ఎలాంటివాళ్ళు ఎంతమంది వుంటేమాత్రం, ఏం ప్రయోజనం? సెలవు. (కుడివైపు నిష్క్రమిస్తాడు.)

మోహిని: (తల పైకెత్తి దైన్యంతో) సాధనరావుగారు మీరింకా తిట్టకుండా, వెళ్ళిపోకుండా కూర్చుండి పోయేరేం? (మళ్ళీ తల దించుకుంటుంది)

సాధన: నిజం ఆలోచిస్తే తిట్టవలసిన అవసరం నాకేం కనబడలేదు. అయినా దాని గురించి విచారించకు. వస్తా! (కుడివైపు వెళ్ళిపోతాడు)

సత్యం: (నెమ్మదిగా) మోహినీ! కపట నటనా దొంగతనం లాంటిది. అది కొంతకాలం అసిపోయినా అంతకాలం అసిపోదు. నిజం నిలకడ మీద తెలియకపోదు. అయినా, ఇప్పుడు విచారించి లాభమేమిటి? అయినదేదో అయిపోయింది. "ఇదంతా మన మేలుకోసమే!" అంటారు పెద్దలు. అంచేత ఇప్పటికైనా ఈ బూటకపు నాటకాలను కట్టిపెట్టి, గతాన్ని విస్మరించి, భావిని బాగుచేసుకో. ఏకాంతాన స్వాంతాన ప్రశాంతంగా ఆలోచించి, యదార్థము తెలుసుకొని నీ అభిప్రాయాలు మార్చుకొని, ఇకముందు స్వచ్ఛందమైన జీవితం

గడుపుతావని ఆశిస్తున్నా; పరిపూర్ణమైన పరివర్తన పొందేక నీ హృదయంలో నా హృదయంలో స్థానం పొందాలనే, కోరిక వుంటే, అందుకు అభ్యంతరం నాకులేదు. ఇప్పటికైనా నా సత్యాన్ని తెలుసుకుంటావనుకుంటా! (కుడివైపు చిరునవ్వుతో నిష్క్రమిస్తాడు. అంతవరకు తలవంచుకు నించున్న మోహిని తల పైకెత్తుతుంది. ఆమె మోహం అవమానంతో పాలిపోతుంది. పొంగిపొరలి వస్తున్న దుఃఖాన్ని ఆపుకోలేకున్నట్టుంటుంది. అరనిముషం అలావుండి, తటాలున చేతులతో మొహం కప్పుకుంటుంది దుఃఖం ఆపుకోలేక. తెరపడుతుంది.)

సమాప్తం.





"గౌరి"

## శ్రీమతి పాలగుమ్మి సుమతి

బి. ఎస్‌సి., బి. ఇడి.

వయస్సు 22 సం.



ఉక్కాని సంస్కారం సాహిత్యాభిలాష గల్గిన కుటుంబంలో జన్మించారు. వీరి తండ్రిగారు, కీ. శే. అత్తిలి సూర్యనారాయణగారని ఎరుగని వారు అరుదు.

కాకినాడ కాలేజిలో విద్యాభ్యాసం ప్రారంభించి మద్రాసు విశ్వ విద్యాలయంలో బి ఎస్‌సి. బి. టి. డిగ్రీలను పొందారు.

సాహిత్య రంగానికి శ్రీమతి సుమతిగారు అంత పరిచితులు కాక పోయినా, అప్పుడప్పుడు వారి రచనలు పత్రికల్లో ప్రకటితాలవుతూనే వచ్చాయి.

కథనికా రచనే కాక నాటికలు, రేడియో ప్రసంగాలు అనేకమైనవి చేశారు. రేడియో శ్రవ్య నాటికలలో అనేక పర్యాయాలు పాల్గొన్నారు.

ప్రస్తుతం హైదరాబాదు స్టాన్లీ బాలికల విద్యాశాలలో పనిచేస్తు న్నారు.





## శ్రీయుతులు సురమౌళి, చిన వెంకటరెడ్డి.

తెలంగాణాలోని చైతన్యవంతమైన రెండు కరీంనగర్ నల్గొండ జిల్లాలలో జన్మించి, జీవిత సమరం లోని మజిలీగా ప్రస్తుతం హైదరాబాదులో కలుసుకొని పల్లెటూరు మాటల్లోని పాట్ల సొంపులనూ, [illegible]త్వాన్ని పరిమళించడానికి కృషి చేయటంలో ఇద్దరికీ కల అభిరుచిని [illegible]చుకొని సాహితీ తపస్సు చేస్తున్నారిద్దరూ.

శ్రీ సురమౌళి కరీంనగరం జిల్లాలో ఇలాసాగరం అనే గ్రామంలో జన్మించారు. హైదరాబాదులో ప్రభుత్వ ఉద్యోగులుగా పని చేస్తున్నారు. సాధన అనే కథల సంపుటిలో వీరి మొదటి [illegible]భాషలో వ్రాసిన కథ ప్రచురితమైంది. అంతకు ముందు కలం పేరుతో కథలు వివిధ పత్రికలకు వ్రాసినా 'సాధన' ప్రచురింపబడిన తరువాతే వివిధ పత్రికల ద్వారా సాహితీ జగత్తుకు పరిచయమైనారు. వీరికి అభిమాన రచయిత గోపీచంద్. గోపరాజు రామచంద్రరావు గారిని మార్గదర్శకులుగా వీరి జీవితాన్ని దిద్దుకోవడానికి కృషి చేస్తున్నారు.

శ్రీ చిన వెంకటరెడ్డి, సూర్యాపేట తాలూకా, నల్లగొండ జిల్లాలో యర్కారంలో జన్మించి, హైదరాబాదు ప్రజాపోరాటంలో కోదాటి నారాయణరావు గారి నాయకత్వాన పాల్గొని, త్యాగాలు చేశారు. ఉద్యమ కాలంలో వీరు వ్రాసిన గేయాలు తెలంగాణా అంతటా ప్రాకి ప్రజలను ముందడుగు వేయించినవి. అయితే వీరి పాటలు పాడుకొని ఉద్రేక పడుతున్న అనేక కార్యకర్తలకు వీరి పేరు కాని, వీరే ఆ పాటలను వ్రాశారని కాని తెలియదు. వెంకటరామారెడ్డిగారి జీవిత చరిత్రను వీరు బుర్రకథగా వ్రాశారు. రెడ్డియువజన సంఘం వారు దీన్ని ప్రచురించారు. బుర్రకథలు వ్రాయటంలోను, తెలంగాణా గ్రామీణులు నిత్యం మాట్లాడుకునే మాటలను అవే సంపు సొంపులతో మాట్లాడటంలోను వీరిది అందె వేసినచేయి. ప్రస్తుతం హైదరాబాదు రేడియోలో పని చేస్తున్నారు.



## శ్రీ జోశ్యభట్ల గున్నేశ్వరరావు

వయస్సు: 24 సం.

నివాసం: విజయనగరం



కాకినాడ కాలేజీలో ఇంటర్మీడియెటు (కామర్సు) వరకు విద్యాభ్యాసం చేశారు. సారస్వత రంగంలోకి ఆశాపూరితంగా ఉత్సాహంగా దుమికిన యువకులు శ్రీ గున్నేశ్వరరావుగారు. వీరి పేరుతోను మరో ఉపనామంతోను, "వినోదిని" "ఆంధ్ర వార పత్రిక"లలో కథలు గేయాలు చాలా ప్రచురించబడినాయి.

"మాయ" అనే నాటకం, "పెళ్ళి ప్రయత్నం" అనే నాటిక వీరి అముద్రితాలు. తమ ఉత్సాహంతోను, కృషితోను పరిణతిపొందిన చక్కని రచనలు ముమ్ముందు వీరు చేయగలరనడానికి సందేహం లేదు.



# నవ్య సాహితీ సమితి
## హైదరాబాదు.

**కార్యవర్గము:**

| | | |
|---|---|---|
| శ్రీ. | పోతుకూచి సాంబశివరావు. బి. ఎ. | అధ్యక్షుడు. |
| ,, | కాలనాథ భట్ట వీరభద్రశాస్త్రి బి. ఎ. | ఉపాధ్యక్షుడు. |
| ,, | ఇనుకపల్లి లక్ష్మీనరసింహశాస్త్రి బి. కామ్. బి. యల్. | ,, |
| ,, | వేమరాజు నరసింహారావు బి. ఎ. | కార్యదర్శి. |
| ,, | వేమూరి సుబ్బరామ శర్మ బి. ఎ. (ఆనర్సు) | సహాయ కార్యదర్శి. |
| ,, | జయంతి సత్యప్రభు బి. యస్. సి. | ,, |
| ,, | ఎ. వి. రాధాకృష్ణ బి. ఎ. | కోశాధికారి |
| ,, | గోపరాజు వెంకటరామ కనకం | కార్యాలయ కార్యదర్శి |

**ప్రతినిధి వర్గము:**

| | | |
|---|---|---|
| శ్రీ. | పైడిమర్రి వెంకటసుబ్బారావు | ఖమ్మంమెట్టు. |
| ,, | నదితాల సూర్య చింతామణిశాస్త్రి | గుంటూరు. |
| ,, | పార్నంది లక్ష్మణరావు యం. యస్. పి. | నర్సాపురం. |
| శ్రీమతి | అత్తిలి స్వరాజ్యలక్ష్మి బి. ఎ. బి. ఇడి. | హనుమకొండ. |
| శ్రీ. | మిర్యాల కృష్ణమూర్తి బి. యస్. సి. | సికింద్రాబాదు. |
| ,, | పోతరాజు గోపాలరావు బి. ఎ. | ఇల్లెందు. |
| ,, | అక్కినేపల్లి గోపాలరావు | దత్తప్పగూడెం. |
| ,, | సోమంచి రామం బి. యస్. సి. | పెనుగంచిప్రోలు, కృష్ణాజిల్లా. |
| శ్రీ. | పి. బి. శాస్త్రి బి. ఏ. | కాకినాడ. |
| ,, | ముత్యపీర వెంకట దీక్షితులు | ములపల్లు. |
| ,, | ధరణికోట శ్రీనివాసులు | నల్లగొండ. |
| ,, | వై. వి. సుబ్బారావు | కర్నూలు. |
| ,, | నిమ్మగడ్డ విశ్వనాథం బి. ఎస్. సి. | హైదరాబాదు. |

**సభ్యులు:**

| | | |
|---|---|---|
| శ్రీ. | జి. జనార్దనరెడ్డి బి. ఎ. | ఇల్లెందు. |
| ,, | కంచనేపల్లి వెంకట రామారావు ఎమ్. ఎల్. ఎ. | నల్లగొండ. |
| ,, | డి. భాస్కరరావు బి. ఎ. బి.యస్. సి.ఎల్. ఎల్.బి. | హైదరాబాదు. |
| శ్రీమతి | వేమరాజు సుభద్రాదేవి ఎమ్. ఎ. బి. ఇడి. | హైదరాబాదు. |
| శ్రీ. | గొబ్బూరి రామచంద్రరావు బి. ఏ. | హైదరాబాదు. |

శ్రీ. సమకూరు నారాయణరావు బి. ఎ. ఎల్. ఎల్. ఎమ్. న్యూఢిల్లీ
" ఉ. రాంకిషన్ రావు హైదరాబాదు.
" చే. వెంకటేశ్వరరావు బి ఎస్. సి. "
" ఇ. రంగారెడ్డి బి. కామ్. ఎల్. ఎల్. బి. "
" జి. సురమౌళి "
" టి. యస్. స్వామినాథం దేవరకొండ
" పోశెట్టి వెంకట సుబ్బారావు బి. ఏ. హైదరాబాదు.
" జే. వెంకటప్ప శర్మ బి: కామ్. "
" గరిమెళ్ళ సుబ్రహ్మణ్యం ఎమ్. ఎ. బొంబాయి.
" ఆసుకపల్లి దక్షిణామూర్తి బి. కాం. హైదరాబాదు
" పాలగుమ్మి విశ్వనాథం "
" గరిమెళ్ళ రామమూర్తి బి. ఎ. "
శ్రీమతి పి. సుమతి బి. యస్. సి. బి. టి. "
శ్రీ కె. నవీనచందర్ బి. ఏ. "
" చివుకుల గోపాలకృష్ణ యం. ఎ. బి. ఇడి. సికింద్రాబాదు.
" చాగంటి భీమశంకర శర్మ బి. కాం. హైదరాబాదు.
" కరుగంటి కృష్ణమూర్తి బి. కాం. ఎల్. ఎల్. బి. "
" పురాణపండ దీక్షితులు "ఉషశ్రీ" కాకినాడ.
" పి. వి. జె. క్రిష్ణారావు "
" జి. జావాబా హైదరాబాదు.
" కాశీనాథుని శ్రీరామచంద్రమూర్తి "
" కోట సత్యనారాయణమూర్తి "
" పాలగుమ్మి రామారావు సికింద్రాబాదు.
" కందుకూరి లింగరాజు బి. ఎ. హనుమకొండ.
" అత్తిలి రామమోహనరావు కర్నూలు.
" బోడి గోపాల క్రిష్ణమూర్తి గుంటూరు.
" కె. బి. కోసనం బి. ఎస్. సి. హైదరాబాదు.
" రావులపాటి శ్రీనివాసమూర్తి సికిం|దాబాదు.
శ్రీ. న. పేరి శాస్త్రి ఆలమూరు తూర్పుగోదావరి జిల్లా
" వేమరాజు సర్వేశ్వరరావు భల్లీభక్ (పశ్చిమ బెంగాల్).
" కరివెంకట లక్ష్మీనరసింహారావు హైదరాబాదు.
" యం|| వాసుదేవరావు బి. ఏ. ఎల్. ఎల్. బి. "

| | | |
|---|---|---|
| శ్రీ. | ఎ. ఆర్. క్రిష్ణ | హైదరాబాదు. |
| ,, | డి. అప్పయ్యశాస్త్రి బి. ఏ. బి. ఇడి. | నల్లగొండ. |
| ,, | డి. సుబ్బారావు బి. ఎ. బి. ఇడి. | ఖమ్మమం మెట్టు. |
| ,, | వై. నరిసిరెడ్డి బి. ఎ. ఎల్. ఎల్. బి. | హైదరాబాదు. |
| ,, | బి. పట్టాభిరామ్ | ,, |
| ,, | జి. శ్రీ. శ్రీరామమూర్తి | మిరియాలగూడ. |
| శ్రీ | అసదుల్లాఖాన్ | హైదరాబాదు. |
| ,, | మానేపల్లి లక్ష్మణరావు | ,, |
| ,, | కె. అప్పారావు బి. ఎ. బి. ఇడి. ఎల్. ఎల్. బి. | ,, |
| ,, | ఆ. సత్యనారాయణమూర్తి (ఐసోలా) | సికింద్రాబాదు. |
| ,, | సి. హెచ్. వాసుదేవమూర్తి బి. ఏ. | మెదక్. |
| ,, | కె. కామకాయన శర్మ బి. కాం. | హైదరాబాదు. |
| ,, | ముళ్ళపూడి పార్థసారధి | నల్లగొండ. |
| ,, | తి. వె. రాఘవచార్యులు | హైదరాబాదు. |
| ,, | వి. వి లక్ష్మీనరసింహారావు | ఖమ్మం మెట్టు. |
| ,, | సిద్ధాంతి మల్లిఖార్జునం బి. ఏ. బి.ఇడి. నాయుడు పేట | నెల్లూరు జిల్లా. |
| ,, | చెంగల్వాల వెంకటరత్నం ఎం. ఎస్. సి. | హైదరాబాదు. |
| ,, | టి. భాస్కరరావు బి. ఏ. "స్ఫూర్తిశ్రీ" | గుంటూరు. |
| ,, | కంచి వాసుదేవరావు | మచిలీపట్టణం. |
| ,, | జె. ఆర్. బి. శర్మ | సికింద్రాబాదు. |
| ,, | మం॥ సూర్యనారాయణమూర్తి | హాతిధా, (బీహార్). |
| ,, | యం॥ ఎ. లతీఫ్ బి. కాం. | హాతిధా. (బీహార్). |
| ,, | జి. శ్రీరామమూర్తి బి. ఇ. | హాతిధా. (బీహార్). |
| ,, | డి. బి. కె. రావు | హాతిధా. (బీహార్). |
| ,, | పి. సుబ్బారావు | హాతిధా. (బీహార్). |
| ,, | పి. యన్. రామారావు | తూర్పు గోదావరి జిల్లా. |
| ,, | నంబూరి సుబ్బారాజు | హైదరాబాదు. |
| ,, | పి. కోటీశ్వర హనుమంతరావు | ,, |
| ,, | యన్. పురుషోత్తం. | హైదరాబాదు. |
| ,, | జె. యస్. శర్మ. | ,, |
| ,, | ఎ. అప్పారావు. | ,, |
| ,, | వెంపటి వెంకటేశ్వరరావు. | ,, |

| | | |
|---|---|---|
| శ్రీ. | కె. రాంబాబు. బి. ఏ. | హైదరాబాదు. |
| ,, | కె. గోపాలకృష్ణ, | ,, |
| ,, | ఎల్. రామయ్య. | ,, |
| ,, | జి. హనుమంతరావు. ఎమ్. ఎల్. ఏ. | ,, |
| ,, | జి. హనుమంతరావు. | ,, |
| ,, | పి. పట్టాభిరామారావు. | ,, |
| ,, | యస్. రామం. | ,, |
| ,, | కొండపాక మురళీధరరావు. | ,, |
| ,, | ఎ. వెంకటనారాయణమూర్తి. | ,, |
| ,, | గుడిపాటి అప్యరాజు. | ,, |
| ,, | పి. సుబ్బారావు. | ,, |
| ,, | బి. నరసింహారావు. | ,, |
| ,, | జి. యస్. శర్మ. | ,, |
| శ్రీమ. | ఎ. శ్రీరామమూర్తి, | ,, |
| ,, | ఆర్. ముంగిశర్మ. | ,, |
| ,, | కె. ప్రసన్నగోపాల్, | ,, |
| ,, | జి. వి. ఆర్. కృష్ణారావు. | సికింద్రాబాదు. |
| ,, | యస్. వి. సత్యనారాయణమూర్తి. | కర్నూలు. |
| డా. | కే. కేశవకుమార్. ఎం. బి. బి. ఎస్. | హైదరాబాదు. |
| శ్రీ. | వై. ఒ. రావు. | గరహార హాతీదా బీహార్. |
| ,, | కె. కృష్ణమూర్తి. | ,, |
| ,, | వి. వెంకటేశ్వర్లు. బి. కాం. | ,, |
| ,, | వాడ్రేవు జ్ఞానసుల్లేశ్వరరావు. | కలకత్తా. |
| ,, | జి. కృష్ణమూర్తి. బి. కాం. | గూటాల. |
| ,, | సముద్రాల సుందరరాజ్. | మద్రాసు. |
| ,, | గోవిందరాజుల వెంకటేశ్వరరావు. | పెనుగంచిప్రోలు కృష్ణాజిల్లా. |
| ,, | యస్. పార్థసారథిరావు. | మద్రాసు. |
| ,, | అయ్యగారి సీతారామారావు. | మద్రాసు. |
| ,, | పేరి రాధాకృష్ణారావు. | మద్రాసు. |
| ,, | బో. వీరాంజనేయులు. | మద్రాసు. |
| ,, | వి. ఎస్. మూర్తి. | హాతీదా బీహార్. |